JAGATI Rs. 2-00 August 1990

35th Year of Publication




## ఆగస్టు - 1990

### సాహితీ సుధ

పరహింసా పరకీయ విత్తహరణా భావంబు సత్య వ్రతా
దరముం దానపరత్వ మన్య వనితో దంతోక్తి మూకత్వముం
బరతృష్ణా ఝుర భంజనంబు గురు నమ్రత్వంబునుం బ్రాణ భృ
త్కరుణా శాస్త్ర సమత్వ సద్విధులు భద్ర ప్రాప్తికిన్మార్గముల్

—భర్తృహరి



జందె మింపుగ వేసి సంధ్యవార్చిన నేమి - బ్రహ్మ నెఱుంగకున్న బ్రాహ్మణుండె
తిరుమణి శ్రీచూర్ణ గురురేఖ లిడ నేమి - విష్ణు నెఱుగకున్న వైష్ణవుండె

బూదిని నుదుటను బూసికొనిన నేమి - శంభు నెఱుగకున్న శైవజనుండె
కాషాయవస్త్రాలు గట్టి కప్పిన నేమి - యాశలుడుగకున్న యతివరుండె

ఇట్టి లౌకికవేషాలు గట్టుకొనిన - గురుని జెందక సన్ముక్తిదొరక బోదు
భూషణవికాస శ్రీధర్మపురనివాస - దుష్టసంహార నరసింహ దురితదూర

—వరసింహ శతకం

'జ గ తి' - 2, కచేరీ రోడ్, మైలాపూర్, పి బి 2922, మద్రాసు - 600 004
ఫోన్ : 76697 - చందా 2 సంIIలకు రు. 45-00 - 5 సంIIలకు రు. 100-00 - జీవిత
చందా రు. 300-00. పాట్రన్ - రు. 1000-00. విదేశాలకు 2 సంIIలకు రు.100-00

ముఖచిత్రం : గురుదేవ్ టాగూర్

# నిమ్మతోనులు

వసంత, విక్రమ్‌లు హనీమూన్‌కి ఊటీ వెళ్తున్నారు. అంతకి మూడేళ్ల క్రితమే పెళ్లయిన విశ్వనాథం, మిత్రుడైన విక్రమ్‌కి యిలా సలహా చెప్పాడు.

"బ్రదర్, ఈ వారం రోజులు నీకు గడ్డు రోజులు. ఉదయం బ్రేక్ ఫాస్ట్ అవగానే లంచ్ టైము దాకా తిరిగిరండి- పార్కులూ, రోడ్లూ, స్మాల్ షాపింగ్. మధ్యాహ్నం టీ అయాక, చిరుచలి తరిమే దాకా తిరగండి. ఈ లోపల ఆమె తన అభిప్రాయాలు చెబుతూ వుంటుంది. ఏదీ కాదనకు - అన్నీ వొప్పేసుకో మనసులేగాక అభిప్రాయాలు కూడా ఒకటవడం మన సుకృతమని నేర్పుగా అందంగా చెప్పు. సాయింత్రం అయిదున్నరకి ఠంచన్‌గా యింటికొస్తాననీ, అరున్నరకి మూవీకో, మ్యూజిక్ కాన్సర్ట్‌కో వెళ్దామనీ, అది వారాలు ఫ్రెండ్స్‌ని పిలుద్దామనీ, అత్యంత విధేయుడైన వ్యక్తిగా ఆమెకి నమ్మకం కలిగించు. ఆ వారం రోజులలో నీ మీద నమ్మకం కుదిరిందా, ఆపైన నువ్వు లేటుగా వచ్చినా, ఎన్ని అబద్ధాలు చెప్పినా, మగాళ్లంతా యింతే లెమ్మని సరిపెట్టుకుంటుంది."

—ఆర్ జగన్నాథం
విశాఖపట్నం-3

డాక్టర్ మురళీధర్ వద్దకు వచ్చిన ఆనందరావు మూడు యిళ్లూ, రెండు సినిమా థియేటరులు ఒక బట్టల షాపూ గల పెద్దమనిషి. తన ఆరోగ్యం గురించి నిరంతర తాపత్రయమాయనికి - ముఖ్యంగా హార్ట్‌గురించి! మిత్రుడు శ్యామల్రావుకి 'బైపాస్' అయినప్పట్నుంచీ ఈ భయం గట్టిగా పట్టుకుంది.

ఆనందరావు మనస్తత్వం తెలిసిన మురళీధర్ అతని బుజం మీద చేయి వేసి, ఆప్యాయంగా పల్కరిస్తూ "హౌ ఆర్ యు ?" అని అడిగాడు.

"ఈ హార్ట్ గురించే నాకు భయంగా ఉందండీ"

"మీరేమీ దిగులు పడకండి - నేనున్నాను కదా! యువర్ హార్ట్ ఈజ్ వండర్‌ఫుల్. మీరు బ్రతికున్నంత కాలం అది మిమ్మల్ని ఏమీ యిబ్బంది పెట్టదు" - అని డాక్టరు మురళీధర్ వెన్ను చరిచి, ధైర్యం చెప్పేసరికి, హాయిగా నవ్వుకుంటూ వెళ్లిపోయాడు ఆనందరావు.

—యల్ మోహనరావు
శ్రీకాకుళం

డెబ్బయి మూడేళ్ల విమలగారు అనేక సంఘ సేవా కార్యక్రమాలు నిర్వహించే విదుషీమణి, జాతీయోద్యమంలో

పాల్గొని జైలుకి కూడా వెళ్లింది. అయితే అసెంబ్లీ ఎన్నికలలో ఆమెకు పార్టీ టికెట్ లభించని కారణాన రాజకీయాలు వొదులుకుంది.

ఒక కుర్ర జర్నలిస్ట్ ఆమెని ఇంటర్వ్యూ వేయడానికి వచ్చాడు.

మీరు చేసే సేవ పేదలకు అందుతుందా, మీ సదనంలో ఏ వర్గం వారికి ఆశ్రయమిస్తారు, ఎంతమంది ఉన్నారు? ప్రభుత్వం మీ కెదైనా గ్రాంటు యిస్తుందా?" - యిటువంటి ప్రశ్నలయాక, యింటర్వ్యూలో 'పెప్' కోసమా అన్నట్లు "స్త్రీలకు రొమాంటిక్ నవలలు చదవాలనే ఆసక్తి ఏ వయసులో పోతుంది?" -అని అడిగాడు.

ఈ ప్రశ్నకు విస్తుపోయిన విమల గారు "అదేమిటబ్బాయ్, నన్ను అడుగుతావ్ - ఎవరైనా పెద్దవాళ్లని అడగాలి గాని!" అన్నారు.

—జె సుందరి
అనంతపురం-1

సన్నబడేందుకు హెల్త్ సెంటర్‌కి వచ్చిన స్వామినాథం, వ్యాయామానికి అనుకూలంగా వుండే పైజమా షర్టూ కొనుక్కునేందుకు, దగ్గరలో ఉన్న క్లాత్ ఎంపోరియమ్‌కి వెళ్లాడు. ఈయన సైజుకి సరిపడేవి చూపించింది సేల్స్‌గరల్.

స్వామినాథం ఒక సెట్ సెలక్ట్ చేసి, పక్కన పెట్టాడు.

"బిల్లు వేయమన్నారా?" అని అడిగింది సేల్స్‌గరల్.

"నేను సన్నపడ్డాక యిది పనికి రాదేమోనని ...."

"మీకా సందేహ మక్కర్లేదు — మీతో బాటే ఈ క్లాతూ ష్రింక్ అవుతుంది."

—వి జానకి
విజయవాడ-2



మానవుడు ఉదాత్తమైన మృగం - జనన మరణాలు రెండూ అతనికి పండగలే!

—బ్రవుని

నరుడు నరులపట్ల చూపుతున్న అమానుషత్వానికి శతకోటి గుండెలు ద్రవిస్తున్నాయి.

—బన్సి







# పాఠకుల తీర్పు

చందూర్ దంపతులకు : శాంతా మూర్తి ద్వారా మీరు నాకు పరిచితులే గాక, సన్నిహిత స్నేహితులుకూడా. గత ముప్ఫయి నాలుగు సంవత్సరాలుగా ఒక తెలుగు మాసపత్రికను ప్రచురిస్తున్నారంటే, అది గొప్ప విశేషమే! అందుకుగాను మీరు అభినందనీయులు.... గోపాలరెడ్డిగారి కవితలలో ఏదో ఒకటి రోజూ చదువుతూ వుంటాను. మన తెలుగు రాజకీయ నాయకులలో, బూర్గుల రామకృష్ణారావు, దామోదరం సంజీవయ్య సాహిత్యాభిమానులు. ఇప్పుడున్న వారిలో గోపాలరెడ్డిగారు ఒక్కరే! తమ జీవితానుభవాలని, ఏర్చి కూర్చి, చక్కని వాక్పటిమతో కవిత లందిస్తున్నారు. ఈసారి వారిని కలిసినప్పుడు, వారి రచనలు చదివి, ఆనందించే అజ్ఞాత ఆంధ్రులలో నేనొకడినని మనవి చేయ ప్రార్థన.

—నరసింహమూర్తి

మిడిల్ వున్-అమెరికా

శ్రీ మావయ్యగారికి : మైలాపూరు నుంచి ఈ ఉత్తరం ఏమిటా అని ఆశ్చర్యపోతున్నారా? మరేమీలేదు. మనస్సులోని కృతజ్ఞతలు వెంటనే చెప్పకపోతే, ఎప్పటికీ చెప్పనేరక పోతానేమోనన్న భయం.... మా కాలేజీ అసెంబ్లిలో 'ఎన్వయిర్నమెంట్' గురించి యడ్రస్ చేయవలసివచ్చింది. 'చిప్కో' గురించి మీరేదో రాశారని గుర్తుకొచ్చి, పాత 'జగతి' లు తిరగేశాను. ఆగస్టు 89 సంచిక ముఖచిత్రమైన 'కన్నీరు కార్చే వృక్షరాజం' గురించి మీరువ్రాసినదీ, 'హిందూ'లో సుందరలాల్ బహుగుణ నిరాహార దీక్ష వచ్చినదీ జోడించి చెప్పాను.... మీరు పరోక్షంగా నాకు చేసిన ఈ సహాయానికి చాలా థాంక్స్.

—యశోదా దొరైస్వామి

మద్రాసు-4

ప్రియమైన చందూర్ గారికి : నమస్కారములు. 'జగతి' లో ప్రత్యేక వరవడి వుంది.... ఎన్నో సంవత్సరాల క్రితం ఏలూరులో మిమ్మల్ని, 'మిస్ ప్రేమ, బిఏ' హాస్యనాటక ప్రదర్శన సందర్భంగా కలుసుకున్నాను. నేనందులో సూత్రధారుణ్ణి - జియన్ స్వామి కవి పాత్ర ధరించాడు.... ఆనందవాణి, ఆంధ్రభూమి, వాణి, ప్రజా మిత్ర వంటి పత్రికల సంపాదక వర్గంలో పని చేశాను - ముద్దా విశ్వనాధంగారు మాగురువు.... మీ దాంపత్యం ఆదర్శప్రాయమని అనుకుంటూంటాము.

—బివి రమణ

కటక్-8

# వెన్నెల కెరటాలు

## బొంబాయి ఆంధ్రులు

బొంబాయిలో అయిదారు లక్షల తెలుగుప్రజ నివసిస్తోంది. కాయకష్ట జీవులున్నారు. బుద్ధి జీవులున్నారు. కార్మికులు, మేస్త్రీలు, కాంట్రాక్టరులు, వ్యాపారస్తులు, పారిశ్రామికవేత్తలు, ఉద్యోగస్తులు వున్నారు. బొంబాయి నగరం, హైదరాబాదు నగరం కంటే ఆరు రెట్లు పెద్దనగరం. హైదరాబాదు తరువాత కార్పొరేషను నగరాలయిన విశాఖపట్నం, విజయవాడల జనాభా ఎంతో బొంబాయిలో తెలుగు జనాభా అంత. బొంబాయి అంటే కేవలం బొంబాయి మ్యునిసిపల్ కార్పొరేషన్ లోవున్న నగరమే కాక, పరిసర ప్రాంతాలలోవున్న, న్యూబొంబాయి, ఠాణా, కళ్యాణ్, అంబరనాథ్, భివండి వంటి పట్టణాలన్నీ, బొంబాయి సంకేతం కిందనే పరిగణనలోకి వస్తున్నాయి. ఆంధ్రమహాసభ, ఆంధ్ర ఎడ్యుకేషన్ సొసయిటీ, ప్రముఖ సంస్థలు అవసరాలనుబట్టి, కొన్ని డజన్ల తెలుగు సంస్థలు వెలిశాయి.

—సోమంచి యజ్ఞన్నశాస్త్రి
'మహాంధ్ర'లో

సంజయుడు శ్రీకృష్ణుని యోగేశ్వరుడని సంబోధించెను, యోగేశ్వరుడు, యోగీశ్వరుడు అను రెండు మాటలలో గల తార తమ్యాన్ని గమనించాలి. 'యోగీణాం ఈశ్వరః యోగీశ్వరః' - యోగులకు ఈశ్వరుడు యోగీశ్వరుడు పరమశివుడు. 'యోగస్య ఈశ్వరః యోగేశ్వరః' - యోగులకు ఈశ్వరుడు యోగేశ్వరుడు శ్రీకృష్ణ భగవానుడు. భూతకాలంలో ఉండినట్టి వర్తమానంలో ఉన్నటువంటి, భవిష్యత్తులో ఉండేటువంటి, సమస్త యోగులకు రక్షకుడు, సంచాలకుడు, పాలకుడు, పరమశివుడే. యోగియైనవాడు సదా శివుని శరణాగతి కోరకుండా తన యోగంలో సాఫల్యత నొందలేడు. శంకరుడే యోగమార్గములన్నింటికి ప్రవర్తకుడు. "సర్వ యోగానామ్ ఈశ్వరః తత్ప్రభవ త్వాత్ సర్వయోగ బీజస్యచతృష్టా - యోగేశ్వరః" అని శ్రీమచ్ఛంకర భగత్పాదులు తమ గీతా భాష్యంలో వివరించినారు. సర్వయోగములకు ఈశ్వరుడు, సమస్త యోగముల పుట్టుకకు బీజము కృష్ణుడు.

—యమ్ వెంకటరామశర్మ
'శ్రీరామకృష్ణప్రభ'లో

# పాతికేళ్ల నాటి పిక్చర్

## రామకృష్ణా - యన్‌ఎటి
## 'శ్రీకృష్ణ పాండవీయము'

మహాభారతములో పంచ భీములు వున్నారు. అందరికీ తెలిసిన కుంతీ పుత్రుడు ; ఆ తర్వాత జరాసంధుడు, బకాసురుడు, కీచకుడు, సుయోధనుడు. ఈ అయిదుగురిలో ఎవరు మరొకరిని మొదట సంహరిస్తారో, వారే మిగతా ముగ్గురినీ చంపుతారనే శాపమో వరమో ఉంది. 'పంచభీమ ప్రహసనం' సంస్కృతంలో ప్రసిద్ధిపొందిన దృశ్య కావం - అది ఆధారంగా చేసుకొనే, ఈ చిత్రం నిర్మితమయింది. తనవల్ల నయేపని కాదని, కుంతీ మధ్యముడైన భీమునిచేత, జరాసంధుని చంపించా డట వాసుదేవుడు. అది బకాసురునికి ముందా, తర్వాతా ?-అనేది స్పష్టంగా తెలియదుకాని, ఈ పంచభీమ ప్రహ సంలో మొదట హతుడైనవాడు బకా సురుడు. ఏకచక్రపురంలో తమకు ఆశ్రయమిచ్చిన విప్రుని కుమారులలో రెండవవాడు, అనాటి వంతుగా బకా సురునికి భోజనంగా వెళ్లవలసివచ్చి నప్పుడు, అతని స్థానంలో భీముడు వెళ్లి, బకాసురునితో యుద్ధం చేసి, ఆ రాక్షసుని సంహరిస్తాడు. భీముని చేత బకాసురుని చంపించడమనే పన్నాగం, పూర్తిగా వాసుదేవునిది - లోకకళ్యా ణార్థం, అందుకు పూనుకుంటాడు. అనాడే తెలుసు కృష్ణునికి మిగతా ముగ్గురూ భీముని చేతిలో చావడం ఖాయమని ! ఈ చిత్ర కధకు ప్రధాన సూత్రధారి వాసుదేవుడు. రుక్మిణీ కళ్యాణం, జరాసంధవధ, శకుని పూర్వ వృత్తాంతం, మయసభలోని చోద్యాలు - యిటువంటి అనేకానేక విశేషాలతో, రసస్ఫోరక సన్ని వేశాలతో చకచకా పరిగెడుతుంది పిక్చర్. అయా పురాణవ్యక్తుల చిత్రణ ఎంతో గంభీరంగా సందర్భోచితంగా ఉంది. ఎటొచ్చీ, 'మిరాకిల్స్' లేకుండా వుంటే యింకా రక్తి కట్టేది. యన్‌టి రామారావు తన అపూర్వ నటనాకౌశలంతో ప్రేక్షకులని మెప్పి స్తాడు. మ్యూజిక్ శ్రావ్యంగా వుంది. సంభాషణలలోని భాషా పటిమ బావుంది. బకాసుర వధతో ప్రారంభ మైన ఈ యితివృత్తం, రాజసూయ యాగంలో అర్ఘ్యం అందుకున్న వాసు దేవుడు, శిశుపాలుని తొంభయి తొమ్మిది తప్పులు మన్నించి, నూరో తప్పుకి తన చక్రాయుధంతో అతని శిరసు ఖండించడంతో ముగుస్తుంది. ప్రేక్షక రంజనగల పౌరాణిక చిత్రం.

—యన్నార్ చందూర్ సమీక్ష
'జగతి' - మార్చి 1966

## మానవ ప్రగతి

### సప్తమ ఖండం

ఆ ఖండం ప్రపంచపు ఉపరితలంలో పదోవంతుంటుంది. అక్కడ సూర్యకిరణాలు మంచు పగుళ్లలో దాగిన, పెన్‌గ్విన్ పక్షులమీద సప్త వర్ణాల ఇంద్రధనుస్సు లెక్కవెడుతుంటాయి. ప్రపంచ మానవ మేధో జీవుల ఆలోచనలు, అక్కడి రహస్యాలను శాస్త్రీయంగా అన్వేషిస్తూ పహరా కాస్తుంటాయి. అర్థంకాని అనేక వినూత్న నిధులకు సన్నిధి ఆ ఖండం .... అదే అంటార్కిటికా.... సప్తమ ఖండం. అనంత మహిమాన్విత హిమ ఖండం! మానవజాతిని ప్రకృతి సంపదలతో పైకెత్తిన భుజాదండం! భారత్, చైనా దేశాలు రెండూ కలిపినా అంటార్కిటికా వైశాల్యం కన్నా తక్కువే. 14 వేల చదరపు మిలియన్ కిలోమీటర్ల మేర విస్తరించుకుందీ ఖండం. అత్యంత విలువైన ఖనిజాలకు పుట్టినిల్లు. ఖనిజాలేకాదు, ఖండాంతర్భాగంలో అనంతమైన సహజ వాయువు నిక్షిప్తమై ఉంది. ఏడు ఖండాలలోకెల్లా, అతిచల్లనిదై ఎంతో హొడి హొడిలాడుతూ, వేగంగా గాలులు వీస్తూ మానవులకు దరిజేరనలవి కాకుండా ఉంటుంది. అది భూమండలానికి సరిహద్దు. అంతేకాదు, శాస్త్రజ్ఞులకు ప్రకృతి సిద్ధమైన ప్రయోగశాల. ఈ నేల 90 శాతం మంచుచే కప్పబడి ఉంటుంది. అంతేకాదు, అంటార్కిటిక్ వలయంలోలాగా కాక, 4,900 మీటర్ల ఎత్తున పర్వతాలు సైతం ఇక్కడ ఉంటాయి. అక్కడ ఉన్న మంచు ఎడారిలో మంచులేని 2 శాతం భూమిని 'ఒయాసిస్సు'లని పిలుస్తారు. భారత్ తొలిసారి స్థాపించిన ప్రయోగ కేంద్రం 'దక్షిణ గంగోత్రి' ఒక మంచు గడ్డమీద నిలిస్తే, మన రెండో కేంద్రం 'మైత్రి' ఒక ఒయాసిస్సులో నిర్మించబడింది.

### జంటనక్షత్రం

ఇప్పుడు కక్ష్యలో పరిభ్రమిస్తున్న 'హబుల్ టెలిస్కోపు' అంతరిక్షం నుంచి భూమికి పంపిన చిత్రాలలో ఒక 'జంటనక్షత్రం' ఆచూకీ తెలియడం ఖగోళ శాస్త్రవేత్తలకు అత్యంత ఆసక్తిని కలుగజేస్తున్నది.

భూమిమీద నుంచి పనిచేసే టెలిస్కోపు కనిపెట్టలేని ఈ 'జంట నక్షత్రాన్ని' రోదసి నుంచి పనిచేస్తున్న 'హబుల్ టెలిస్కోపు' కనుగొన్నది. 'కరీనా' అనే దక్షిణ నక్షత్రం మండలంలో ఈ అరుదైన 'జంటనక్షత్రం' వున్నట్టు, యివి కేవలం తొలి ప్రయోగాత్మక చిత్రాలేనని, ఈ 'టెలిస్కోపు' తన పూర్తి సామర్థ్యాన్ని ఇంకా ప్రదర్శించవలసి వున్నదని పరిశోధకులు పేర్కొన్నారు. 1990 ఏప్రిల్ లో అమెరికన్ స్పేస్ షటిల్ నుంచి వ్యోమగాములు ఈ టెలిస్కోపు అంతరిక్షంలో ప్రవేశపెట్టిన తర్వాత ఇది కొన్ని సమస్యలకు గురైంది. అయితే అవన్నీ కూడా అసాధారణ సమస్యలేమీ కాదని, కక్ష్యలో ప్రవేశపెట్టిన తొలి దశలో ఉపగ్రహాలు మామూలుగా ఎదుర్కొనే తొలి సమస్యలతో వాటిని పోల్చవచ్చునని శాస్త్రవేత్తలు చెప్పారు.

## సైన్సు - టెక్నాలజీ

ఈనాడు మానవాళిని పీడిస్తున్న అనర్థాలన్నింటికి సైన్సు, టెక్నాలజీలే కారణమా ? గత శతాబ్దం కాలంలో సైన్సు టెక్నాలజీల ప్రగతిని పరిశీలిస్తే ఈ ప్రశ్నకు సమాధానం సులువుగా లభిస్తుంది. సైన్సు, టెక్నాలజీలు ఈ కాలంలో అన్ని జీవన రంగాలలో మానవాళికి మహోపకారం చేశాయి. ఇంధనం, ఆహారం, ఆరోగ్యం,.... రవాణా, కమ్యూనికేషన్ రంగాలలో ఎంతో సౌలభ్యాన్ని సమకూర్చాయి. మన పూర్వీకులు ఏనాడు కూడా ఊహించలేని సౌకర్యాలు ఈనాడు మనం అనుభవించ గలుగుతున్నామంటే అది సైన్సు, టెక్నాలజీల చలవే. శాస్త్ర విజ్ఞానం అభివృద్ధి చెంది ఉండనట్లయితే హరిత విప్లవం కాని, శ్వేత విప్లవం కాని సాధ్యమయేవా ? అతిశయోక్తి లేదు. అయితే మానవుడు శాస్త్ర విజ్ఞానంపై అతిగా ఆధారపడి ఉండడంతో అనేక దేశాలలో మానవుడి క్షీణత సంభవించింది. ప్రమాదాలకు ఆలవాలమైన అనేక పనులను ఈనాడు మనుషుల స్థానే మర మనుషులు అవలీలగా చేసి వేస్తున్నాయి. దీనివల్ల వస్తూత్పత్తి భారీస్థాయిలో జరగడానికి, ధరలు కూడా సబబుగా ఉండడానికి అవకాశం కలిగింది. అయితే ఈ లాభంతోపాటు సమాజాన్ని దెబ్బతీసే మరో అనర్థం కూడా సంభవించింది. భారీస్థాయి యాంత్రీకరణ ఫలితంగా లక్షలాది మంది కార్మికులు పనులు కోల్పోవడంతో దారిద్ర్యం, దైన్యం పెరిగాయి. ఈ దుష్ప్రభావం పర్ధమావ దేశాలలో మరీ స్పష్టంగా ఉంది. ✤

---

మీకు కావల్సిన ఏదైనా నన్ను నిరభ్యంతరంగా అడగవచ్చు. కాని, కొంచెం టైము యివ్వమని మాత్రం అడక్కండి. నేనేదైనా పొరబాటు చేసివున్నా, పదిమందిలో దుయ్యబట్టకూడదు. మురికిబట్టలు నడివీధిలో వుతుకుతారా ఎవరైనా ?

—నెపోలియన్

---

# కొత్త పుస్తకాలు

బాపూ రమణీయం - ఏభైలనాటి సినిమా రివ్యూలు, కార్టూన్లు, కార్టూనులు, జోకులు, మికతికలు వగైరా. ప్రచురణ : నవోదయ పబ్లిషర్స్, విజయవాడ - 500002. వెల : రు 60-00 - లైబ్రరీ ఎడిషన్ : రు 85-00.

1955 - 60 సంవత్సరాల మధ్య, బాపు, రమణ ఆంధ్ర సచిత్రవార పత్రికలో ప్రచురించిన చిత్ర సమీక్షలూ, వ్యాసాలూ, కార్టూనులూ ఈ పుస్తకంలో పొందుపరచి, దక్షిణ భారత చలనచిత్ర పరిశ్రమకు ఆద్యులు, పూజ్యులు అయిన రఘుపతి వెంకయ్య (1873 - 1941) గారి దివ్య స్మృతికి సమర్పించడం, చంద్రుని కోమాలుపోగు అని చెబుతారే, అటువంటి మంచిపని, మెచ్చుకోదగ్గ సత్కార్యం.

అశ్వరాజ్ వారి 'వినాయకచవితి' తో సమీక్ష, సినీవన కవనానికి వాగ్గాత, సినీ జనరంజన సీమలో శత సహస్రావధాని అయిన సముద్రాల కార్టూన్‌తో శ్రీకారం చుడతారు. ఆ తర్వాత అన్నపూర్ణా వారి 'తోడికోడళ్లు' సమీక్ష. 'సుందరం సరుచిరం - సుస్వరం సుమధురం - శోభనం మోహనం - గాన రాజేశ్వరం'. - అంటారు రాజేశ్వరరావుని.... 'సంతకం అక్కరలేని కవి ఆరుద్ర - అంత్య ప్రాసలే ఆయన వ్రాలు ముద్ర' .... 'జానపథ బాటసారి కెవి రెడ్డి' .... 'అంజలీవారి సువర్ణసుందరి బాక్సాఫీసు సూత్రాల పెద్దబాలశిక్ష' .... ఓ హెన్రీ 'లాస్ట్ లీఫ్' కథని దిలీప్‌కుమార్ 'ముసాఫిర్' ఎలా వంకర్లు తిప్పిందీ చెబుతారు. అలాగే బాలచందర్ 'ఏది నిజం ?'కు (ప్రతిభా) 'ఫ్యూజిటివ్' అనే ఇటాలియన్ చిత్రం ఆధారమైన ప్పటికీ, ఆయన అందులోని వాతావర ణాన్ని పూర్తిగా స్వజాతీయం స్వదేశీయం చేస్తారు, .... 'క్లిష్ట పాత్రలకు చతురంగారావు, దుష్టపాత్రలకు క్రూరంగారావు' .... 'కామిడీ గారడి పారడీ రమణారెడీ' .... పొద్దుటనుంచి సాయంకాలం లోపల నలభయ్యేడు కథలు చెప్పగలరట కథా శివబ్రహ్మం .... 'ధనంజయుని ధనుష్టంకారం లాగే ఈమని వారి వీణాఝుంకారానికి ఒక విశిష్టత ఉంది.' .... వోల్గ్‌మ్యాన్ అండ్ ది సీ, లైమ్‌లైట్ వంటి చిత్రాల సమీక్షలు నేటి పాఠకులకు ఒక విధంగా కనువిప్పు కాగలవు.

తెలుగు చలన చిత్రసీమలోని అందరూ యిందులో ఉన్నారు - అక్కినేని, యన్‌టిఆర్, గుమ్మడి, ఘంటసాల, సుశీల, ఆదుర్తి - వీరూ వారూ అనేమిటి అందరూను - వ్యాఖ్యలతో బొమ్మలూ, కార్టూన్‌లతో! తిలక్ నిర్మించిన అనుపమా వారి 'అత్తా ఒకంటి కోడలే,' ఆరుద్ర రచనకు అరు నయాపైసల బాపు బొమ్మల కథ పుస్తకం, ఆనాటి పబ్లిసిటీలో ఎటువంటి రమ్యత ప్రత్యేకత వుండేవో తెలుపుతుంది.

ముత్యాలముగ్గు, అందాల రాముడు, గోరంతదీపం, సాక్షి, బుద్ధిమంతుడు మున్నగు చిత్రాలలోని జోక్స్ ఈ పుస్తకంలో ఫిల్లర్స్‌గా వాడారు. ఏక బిగిని గాక రోజుకి రెండుమూడు అయిటమ్స్ మాత్రమే చదివి, గతంలోకి వీక్షిస్తే, మనసున వెన్నెలసోనలు కురిసినట్లుంటుంది. ఆంధ్రాలోని ప్రతి గ్రంథాలయంలోను ఉండవలసిన పుస్తకమిది - విలువైన జ్ఞాపకాల దొంతర.

—క్షీరసాగరమ్

✠ ✠ ✠

సూర్యశతకమ్ - మయూర విరచితం. వ్యాఖ్యాత: తాళ్లూరి ఆంజనేయులు. ప్రతులకు: తాళ్లూరి రాకేష్, తిమ్మసముద్రం - 523 185. ప్రకాశం జిల్లా. వెల: రు 25-00.

మయూరకవి శ్రీహర్షుని ఆస్థానంలో క్రీ.శ. 7 వ శతాబ్ది పూర్వార్ధంలో ఉన్నట్లు చెబుతారు. ఆయన రచించిన 'మయూరాష్టకం' కేవలం ఎనిమిది శ్లోకాలతో ఒక యువతి వర్ణన ..... సూర్యశతకానికి తెలుగు పద్యానువాదాలు యింతవరకు దాసుశ్రీరాములు, వడ్డాది సుబ్బారాయుడు, ఆకొండి వ్యాసమూర్తిశాస్త్రి, మల్లాది లక్ష్మీపతిశాస్త్రి వ్రాశారట; మేడసాని మోహన్ ప్రోత్సాహంతో ఈ వ్యాఖ్యానికి పూనుకున్నారు తాళ్లూరి ఆంజనేయులు. భువనగిరి శ్యామలాంబా మల్లికార్జునయ్యగారల ఆర్థిక సహాయంతో ఈ పుస్తకం వెలువడింది.

"సూర్యశతక రచనకు మూలం ఋగ్వేదం .... సూర్యరథ చక్రానికి వుండే పన్నెండు ఆకులు మేషాది ద్వాదశరాశులు .... మోహజాలాన్ని భూమిమీద పరిచే ప్రభువు సూర్యుడు. 'ఖగః పూషా గభస్తిమాన్' - అని ఆదిత్య హృదయం. సూర్యమాయా మోహమూర్ఛితుడై వాల్మీకి, రామాయణం నిండా సూర్యకిరణాలు పోసి నింపాడు. ప్రతి సహస్రశ్లోకి నికాయానికి అగ్రాక్షరంగా ఒక్కో సూర్య మంత్రాక్షరాన్ని నిక్షేపించాడు," అంటారు 'భూమిక'లో శేషేంద్ర.

ప్రభా, అశ్వ, అనూరు, రథ, మండల, రవి - మొత్తం ఆరువర్ణవలు 102 శ్లోకాలలో. ప్రతి శ్లోకానికి ప్రతిపదార్థం, తాత్పర్యం, విశేషాలు, అలంకారం యిచ్చారు వ్యాఖ్యాత. సూర్యుని మహిమలను, ప్రాచీనులు సూర్యుని ఎన్నివిధాల స్తుతించి ఆరాధించేవారో తెలుసుకోనేందుకు,

మన సంస్కృత సాహిత్య సంపదలోని రత్నమాణిక్యాలు గ్రహింపు చేసుకోనేందుకు చదవదగిన పుస్తకం. రచయిత దీనిని భువనగిరి పాపారావుకి అంకితమిచ్చారు.

—సుమతీ సాగర్

✠ ✠ ✠

'స్మృతిగీత' - రమ్యమైన రసభావన. రచన : సి. వేదవతి. ప్రచురణ : స్పందన సాహితీ సమాఖ్య, మచిలీపట్నం - 521 001.... వెల : రు. 20-00.

వైవి రెడ్డిగారి భార్య పేరు రంగనాయకి. ఆమెని ఈ రచయిత్రి ఎప్పుడూ చూడలేదు. ఏభైనాలుగేళ్ల వారి అన్యోన్యానురాగ దాంపత్య దీప్తికి, సుగంధాక్షర రూప మిచ్చారు వేదవతి.... 'జీవితము ఋతు రమణుల నృత్యశాల - మంజీర రవళుల శ్రావ్య రసవేదిక.... జీవితము కొన్ని స్మృతులను కాలిజాడలుగ వదిలి మాయమవుతుంది. ఆ స్మృతులనే ఊత కర్రలుగ అందిస్తాడు కాల ధన్వంతరి. అట్టి కాలిజాడల కథే ఈ పుస్తకము' - అంటారు బెజవాడ గోపాలరెడ్డి - 'జీవనగీత'లో.... 'మధురస్మృతుల పల్లకీలమీద ఊరేగుతూ మానవుడు అమరుడవుతాడు ; స్వప్న విపంచికలు మ్రోగించే గంధర్వుడవుతాడు. స్మరణ పరిమళాలు, అలలు అలలుగా కరిగిపోయాయి' - అని 'స్మృతి మాధురి'లో నారాయణరెడ్డి ; వాగార్థముల వంటి పార్వతీ పరమేశ్వరులని తాతగారు, అమ్మమ్మల గురించి [illegible] సుమతీ నరేంద్ర ; 'ఒకొక్క లేఖ - ఒక్కో జలతారూ దీపం' అని 'అమృత గీత'లో రావూరి భరద్వాజ - ఈ పుస్తకం గురించి ముందు మాటల్లో చెప్పారు.

'ప్రాభాత గీతివై పరమాప్త మూర్తివై, చిరునగవు సిరి యింత పెదవిమాటున దాచి, తొలి వేకువ రేకతో పాటుగా' (విశ్వనాథ) ఈ కథానాయిక. ఆయన జీవితంలో ప్రవేశించి, 'అర్థ బిందువు బ్రతుకింత దనుక - అర్థాంగముగ నీవు చేరవచ్చి - పూర్ణత్వమును కూర్చినావు' అని పలికిస్తుంది. ప్రతి లేఖలోను ఉదాహృత పద్యపాదాలు వున్నాయి - వాల్మీకి, భవభూతి, కాళిదాసు, నన్నెచోడుడు, పిన వీరభద్రుడు, పెద్దన, పోతన మున్నగు ప్రాచీనుల నుంచి, రాయప్రోలు, గురజాడ, కృష్ణశాస్త్రి, వేదుల, విశ్వనాధ, నండూరి, జాషువా, రామిరెడ్డి, గోపాలరెడ్డి వంటి ఆధునికుల వరకు, వారి వారి కవితా సుమాలు ఈ లేఖలకు పుష్టినీ, అర్థవతను, సౌందర్య కాంతినీ యిస్తున్నాయి.

బాలకృష్ణా రెడ్డిగారితో పదేళ్ల క్రితం కలిగిన పరిచయం, ఆయన వినయ సౌశీల్యాలు, కవితాహృదయం, గతించిన హృదయేశ్వరి గురించి ఆయన అప్పుడప్పుడు చెప్పిన మాటలూ, ఆ మాటలు సందర్భంగా వచ్చిన గతకాలపు జ్ఞాపకాలూ, సుమతీ నరేంద్ర (బాలకృష్ణారెడ్డిగారి కూతురు కూతురు) చెప్పిన సంగతులూ —

యిలాటివన్నీ ఈ నూతన సాహితీ ప్రక్రియకు తోడ్పడ్డాయి పరలోకంలో ఉన్న ప్రాణేశ్వరికి 'ప్రియతమా' అంటూ రాసిన ఈ ఏభైనాలుగు లేఖలూ, సాంసారిక జీవితంలోని సరిగమలతో బాటు హృదయ కలశాన్ని అలౌకిక ప్రపంచంవైపు తిప్పుతాయి. అభినందనీయమగు ప్రయత్నం చేశారు వేదవతి.

—క్షీరసాగరమ్

## ఈ మధ్య అందినవి :

శ్వేతకపోతం - కవితా సంపుటి .... తాళ్లూరి అంజనేయులు .... తాళ్లూరి రాకేష్, తిమ్మసముద్రం - 523186 .... రు 10-00.

శ్రీ అన్నమాచార్య చరిత్ర - యక్షగాన ప్రబంధం. బొమ్మకంటి వెంకటరత్నం భాగవతార్, హైదరాబాదు - 20 .... రు 10-00.

వెలుగుబాట - గేయకావ్యం .... యంపి నాగన్న, మామిళ్లపల్లె - 516004. రు 8-00.

తమస్ (టివి సీరియల్) - భీష్మ సహాని రచనకు యార్లగడ్డ లక్ష్మీప్రసాద్ తెలుగుసేత. నవజ్యోతి పబ్లికేషన్స్, విజయవాడ .... రు 25-00.

# నా చిన్ననాటి ముచ్చట్లు

## కెయన్ కేసరి



సంగీత సాహిత్యాభిమానం, స్త్రీ జనోద్ధరణ, పత్రికా ప్రచురణ, వ్యాపారదక్షత, సంప్రదాయం పాటిస్తూనే మూఢనమ్మకాలకు దూరంగా వుండటం, జీవన విధానాన్ని పూర్తిగా మార్చివేసిన గాంధీగారి ప్రభావం, మద్రాసు బెంగుళూరులలోను కేరళాలోను వ్యాపారాభివృద్ధితోబాటు మంచి పేరు తెచ్చుకోవడం, సంస్కరణాభిలాష, గుప్తదానం, విశుద్ధమానవతావాదం - యిలా ఎన్నయినా చెప్ప వచ్చు ఆంధ్రులు గర్వింపదగు మహాపురుషుడు కేసరిగారి గురించి. 1989 జులైనుంచి ధారావాహికంగా వెలువడుతున్న 'చిన్ననాటి ముచ్చట్లు' విషయంలో పాఠకులు చూబుతున్న ఆదరాభిమానాలకు మా నమస్సుమాంజలులు.

ఆ కత్తితోనే మంగలి వూరివారికి క్షౌరమును చేయును. అకాలమున మంగలివారే శస్త్రచికిత్సకులుగ నుండిరి. ఊరిలో యెవరికైనను వ్రణము లేచినప్పుడు మంగలి బాపిగాడే, తాను క్షౌరమును చేయుచుండు కత్తితోనే వ్రణములను కోయుచుండెను. ఆనాడు యొక్క మంగలి కత్తిని ఇన్నిపనులకు వాడుచుండిరి. బహుశః నాబొడ్డును కూడ ఈ తల్లియే ఈ కత్తితోనే కోసి వుండవచ్చునని వూహించెదను.

ఉన్మాదములకు చేయుచికిత్సలు మరియు విచిత్రమైనవి. ఉన్మాదము కల్గిన వ్యక్తి ముందు ఇల్లు వదలును. ఇక నావ్యక్తిచుట్టు పిల్లలు పెద్దలు మూగుదురు. అసలే ఉన్మాది వదరుచుండును. ఈమూక మరీ వదరునట్లుచేయును. రాళ్లువేసియు, గోచిపీకియు హింసింతురు. దానితో ఉన్మాది మరీ రెచ్చిపోవును. సామాన్యముగా నీ ఉన్మాదిని పట్టుకొని గంట్లుపడునట్లు తలగొరిగించి నిమ్మకాయల రసము తలపైనపిండి అంటి స్నానము వేయింతురు. సుమారొక 100 కడవలదాకా అతని కూపిరాడకుండ బావివద్ద కూర్చుండబెట్టి పోయుదురు. దీనినంతయు ఊరిలో పనిలేనివారిచుట్టుమూగి గలభాచేయుచు వినోదముగ చూచుచుందురు. ఈ మంటకు, ఈ గ్యాసుకి ఆ ఉన్మాది మరింత రెచ్చిపోవును.

మరి కొందరు వైద్యులు మూలికలతోను, రసధాతువులతోను నశ్యములనుచేసి వీరిచే పీల్పింతురు. అవి మెదడును మరింత యుద్రేకపరచును. అతిమాత్రముగ పీల్చినప్పుడు రోగి హఠాత్తుగా మరణించుటయుగలదు. ఇట్లే గోదావరిజిల్లాయందలి పాణింగిపల్లి జమీందారు సభ్నివీసు వెంకట కృష్ణారావుగారు మరణించిరని నామిత్రులొకరు చెప్పిరి. వీరు బి. ఎ. చదువుచుండి గాంధీశిష్యులై సహాయ నిరాకరణమొనర్చి 1922 లో 1 సం॥ము జైలుశిక్ష ననుభవించిన దేశభక్తులు.

వాతవ్యాధులవల్ల కాళ్లుచేతులు పట్టుకొనిపోయి స్వాధీనము తప్పినవారికి పేడపురమను చికిత్సను చేయుచుండిరి. అనగా ఒక గుంటను త్రవ్వి ఆ గుంటలో రోగిని నిలుచుండబెట్టి వానిచుట్టు కంఠమువరకు పేడితో పూడ్చెదరు. ఈ ప్రకారము దినము 3 గంటలకాలము పేడగుంటలోవుంచి పిమ్మట లేవదీసెదరు. గూని వుండినవారికికూడ ఈ చికిత్సనే చేయుచుండిరి.

మోకాళ్ళలో దుర్నీరుకూడి వాచి లేచితిరుగుటకు వీలులేనప్పుడు మోకాళ్ల మీద జీడివిత్తుల చమురుతో పుండుచేసెదరు. వీనికే గుర్తులుపెట్టుటయని కూడ అందురు; లేత వాతలను పెట్టెదరు. ఇందువలన అక్కడ పుండుఅయి చేరిన దుర్నీరు కారిపోవును.

పూర్వము సవాయిసంబంధ మగు జబ్బులకును, మేహవ్యాధులకును, తదితర మొండి జబ్బులకును నాటువైద్యులు భాండవకర్పూరమను నొక రస ఔషధమునయిచ్చి చప్పిడి పథ్యమును పెట్టుచుండిరి. ఈరసఔషధమువలన రోగియొక్క దంతములన్నియు పుండ్లుఅయి కదలి చీముపట్టి క్రమముగ ఊడి పోవుచుండెను. ఒకవేళ కొన్ని పండ్లుండి దంతవ్యాధులతో కష్టపడువారు కంసలబత్తునివద్దకుపోయి పటకారుతో పండ్లను వూడపీకించుకొనుచుండిరి.

ఎవరికైనను బలమైన తలభారముతో కూడినజ్వరము, తలనొప్పి, పడిశమువచ్చినప్పుడు నాటువైద్యులు కండ్లలో కలికమును వేయు అలవాటు నాటుపురములలోగలదు. వీరు మిరియములను, లవంగములను, నాభిని శొంఠిని అన్నియునుగాని కొన్నిటినిగాని సానమీద అరగదీసి సుమారు కుంకుడు గింజ పరిమాణమును కండ్లలో వేసెదరు. ఈ బాధకు రోగితట్టుకోజాలక దగ్గిరనుండు వైద్యునిపట్టుకొని మోదుటయు సంభవించును. ఈ కలికము వేసిన కండ్లు నిప్పుకణికలవలె మూడు దినములవరకు యుండును.

కండ్ల దుర్మాంసముల నివర్తికి శస్త్రచికిత్సకుబదులు నాటువైద్యులు విగిరింత గడ్డి వెన్నుతో కండ్లరెప్పలను రక్తమువచ్చువరకు రుద్ది నల్లపూసల కాటుకను వేసెదరు.

నేను చిన్నవాడనైయుండగ మా బంధువులలో నొకరికి యొకవాడు అకస్మాత్తుగా తీవ్రమైన జ్వరమువచ్చి తబ్బిబ్బు మాటలాడుటకు ప్రారంభించిరి. వెంటనే మావూరి నాటువైద్యుడగు తంబళ పున్నయ్యను పిలువనంపి చూపించిరి. వైద్యుడు వచ్చిచూచి ఈ జ్వరము సంగమదోషమువల్ల వచ్చెదనిచెప్పి వెంటనే భార్యశరీరమునుండి రక్తముదీసి కండ్లకు కలికము వేయకుండిన ప్రమాదము కలుగవచ్చునని చెప్పెను. అప్పుడు అత్తగారు కోడలిని చాటుకుపిలిచి రక్తము నివ్వమని అడిగెను. అప్పుడు కోడలు 'అయ్యో నేనే పాపమెరుగనండీ ; నన్నేల బాధించెదరని' ఒట్టుపెట్టుకొని చెప్పెను. అంతట అత్తగారు ఇరుగు పొరుగు ఆడవారిని పిలిచి బలవంతముగ కోడలి కాళ్లుచేతులను పట్టుకొని చేతులనుండు నల్లగాజులను పగులగొట్టి ఆ గాజుపెంకుతో కోడలి శరీరము నుండి రక్తమునుదీసి కొడుకుకండ్లకు కలికమును వేయించినది.

## 21 లలితకళాభిలాష

చిత్రకళ, నాట్యకళ, గానకళ మొదలగు లలితకళలందు నాకు చిన్నప్పటి నుండి నైజముగానే ఎక్కువ అభిలాష కలదు. శాస్త్రయుక్తముగ

ఆయావానిని అభ్యసించుటకు నాకు పూర్తిగ అవకాశము లేకపోయినను ఆయ్యా వానిని చూచి విని వాని ప్రాశస్త్యమును తెలియగల సహృదయుడు అని నా మిత్రులనుచుందురు. నాకుగల ఈ సహజాభిలాష, అభిమానము - ఎట్లు నా జీవితమున వ్యక్తమైనదియు, మరియు ఆయావానిని హర్షించుటలో నా అను భవములను వివరింతును. వీనిని, రెండు భాగములుగ విభజింపవచ్చును. చిన్ననాడు మా యూరియందలి నా యనుభవములు ; నగరవాసుడనైన పిదప నాగరికులతోడి నా యనుభవములు.

## గృహనిర్మాణము

గృహనిర్మాణ మొక శిల్పము. దాని రహస్యము లెరుంగుటయు నొక విశేషమే. చిన్నతనములోనే నాకు ఇందు నేర్పు కల్గినది. కుఱ్ఱతనమున ఆడబిడ్డలకు బొమ్మరిండ్లును అందముగ గట్టుచుంటిని. అందువల్ల ఊరివారందరు వారి బిడ్డలకు బొమ్మరిండ్లు కట్టిపెట్టుమని నన్ను ఆశ్రయించేవారు. ఈ విద్య నేను శిక్షణ లేకనే అలవరచుకొన్నది. తరువాత పెద్దవాడనై ఆరోగ్యసూత్రముల ననుసరించి పూరియింటిని మట్టిగోడలతో నిర్మించగల సామర్థ్యమును సంపా దించియున్నాను. కాలక్రమమున పట్టణమునందు కట్టబడు పెద్దభవనములు ఎట్లు నిర్మించిన అందముగాను, ఆరోగ్యప్రదముగను ఉండునో ఆ రహస్యముల తెలుసుకొంటిని. ఇప్పటికి మద్రాసులో లక్షలాది పెట్టి కట్టించిన నా భవనము లన్నియు నా స్వంతప్లానులతో కట్టినవీ. నా యీశక్తి నెరింగిన మిత్రులుకూడ నా చేతనే తమ యిండ్లకు భవనములకు ప్లానులను చెప్పించుకొందురు. కావున ఇండ్లు కట్టుటయందును, కట్టించుటయందును నాకు కొంత నేర్పరితనము గలదని చెప్పుకొనుటకు సాహసించెదను.

## చిత్రకళ, చిత్రలేఖనము

ఇందును చిన్నతనముననే అభినివేశము ఏర్పడినది. మా అమ్మ పండు గలకు ఇల్లంతయు గోడలకు శుభ్రముగా సున్నము కొట్టించేది. ఆ తెల్ల గోడలు చూడగానే నాకు ఉత్సాహముకల్గి బొగ్గుతీసుకొని తోచినట్లు బొమ్మల గీచేవాడను. వానిని చూచినవారు ఆయాబొమ్మల ముక్కు కన్నుతీర బాగున్నదనియు, నా చేతిలో శిల్పమున్నదనియు మెచ్చుకొనేవారు. కాని మ అమ్మ తెల్లగోడలను బొగ్గుతోగీచి పాడుచేసితినని నన్నుతిట్టేది.

నేను మద్రాసు వచ్చినపిదప మద్రాసులో గోవిందప్పనాయుని వీ యందు టి వి. సుబ్బన్న అండ్ బ్రదర్సు అను పేరుతో చిత్రముల వ్రాయ

ముచ్చి వారుండిరి. వీరు కార్వేటినగరం సంస్థానమున రంగుచిత్రములను వ్రాయుచుండిరిగాని ఆ సంస్థానము తగ్గుదశకు రాగానే వారు మద్రాసుకువచ్చి బొమ్మలను వ్రాయు వ్యాపారమును స్థాపించిరి. వీరు పలకలమీద చింత విత్తనములు జిగురుతో బొమ్మలనువ్రాసి దానిమీద సన్న బంగారు రేకును అంటించి మెరుగుబెట్టి పఠములను తయారుచేయుచుండిరి. అట్లు తయారైన పఠములు యెంతకాలమైనను మాసిపోక మెరుగుతో తళతళలాడుచుండును. వీరు ఈలాటి పఠములను తయారు చేయుటలో చాలా మంచి నేర్పరులు. పూర్వము మద్రాసులో ఈ పఠములకు మంచి గిరాకీ యుండెడిది. మద్రాసులో ఇప్పుడును అనేకుల ఇండ్లలో వీరి పఠములుగలవు. ముఖ్యముగ గోవిందప్ప నాయుని వీధి యందలి ఉప్పుటూరి ఆళ్వారు శెట్టిగారి రామానుజ కూటమున ఇవి గలవు. ఈ పురాతన చిత్రకళ క్రమముగ నశించిపోవుచున్నది; నశించి పోయినదనే అనవచ్చును. నేను వీరివద్ద ఈ పఠములను వ్రాయుపద్ధతిని కొంతకాలము నేర్చుకొంటిని. అయితే నావృత్తి వ్యాపారములు ఈ కళా వ్యాసంగమున కాటంకములైనవి.

అయినను నాకు నైజముగాగల చిత్రకళాభిమానము ఈ అభ్యాసమువలన స్థిరపడినది. అందుచేతనే ఎక్కడ ఏ ఉత్తమచిత్రము కన్పించినను అది నన్నాకర్షించును; అది విలువకు లభ్యమగుచో, తెచ్చి మా యింట నుంచు కొనుటకు కోరుదును. చిత్రకళోపాసకులను నేను పూజించి, ఆదరించుటకును అదేకారణము. వెనుక 'గృహలక్ష్మి'లో మొదట పనిచేసిన శ్రీ కౌతా శ్రీరామశాస్త్రి కుమారులు నా కభిమాన పాత్రులై నావల్ల కొంత సహాయ్యమును పొందిరి. పిదప పెనుగొండ వాస్తవ్యులు వెంకట్రావుగారు, చిత్రకళలో చక్కని నేర్పుకలవారు నాకు పరిచయమైరి. వారి బొమ్మలు మద్రాసులో పలువురి ఇండ్ల నలంకరించి యున్నవి. వీరు అప్పుడప్పుడు 'గృహలక్ష్మి' పత్రిక కొరకు త్రివర్ణ చిత్రములను నేర్పుగ చిత్రించి యిచ్చెడివారు. ఈ చిత్ర కళోపాసకుని నా శక్తికొలది ప్రోత్సహించుచుంటిని. పాపము వారిప్పుడు స్వర్గస్థులు.

## శ్రీమతి రత్నాల కమలాబాయిగారు

ఈమెయు తాను చిత్రించిన త్రివర్ణచిత్రములతో 'గృహలక్ష్మి' పుటల తరచు అలంకరించుచుండిన సంగతి పాఠకులకు జ్ఞప్తియుండును. ఈమె చిత్ర కళానైపుణ్యమునకు మెచ్చి యొకసారి 'గృహలక్ష్మి' స్వర్ణకంకణమును తొడిగి గౌరవించితిని. ఇంకను అనేకులు చిత్రకారులు వ్రాసిన చిత్రములను కొని ప్రచురించి వారికి ప్రోత్సాహ మొసంగితిని. ఆ పఠముల నన్నిటిని నా యింటి

యందు గోడల కలంకరించితిని. మద్రాసులో అప్పుడప్పుడు జరుగు చిత్రకళా ప్రదర్శనములకు నా పటములనుకూడ తీసికొనిపోయి వారు ప్రదర్శించు చుందురు.

## నాట్యకళ

ఆహార్యము, అభినయము, సంగీతము ప్రాధాన్యముగాగల నాట్యకళ బహువిధములు. వీధి భాగవతములు, తోలుబొమ్మలాటలు, భరతనాట్యము, నృత్యము, ఆధునిక నాటకములు - ఇవి అన్నియు ఆ కళ క్రిందికే వచ్చును. వీటన్నిటిని క్రమముగా చూచి ఆనందించితిని. వీటన్నిటి పరిణామము ఈ 60 సం॥లుగా నా శక్తికొలది గమనించి గ్రహించితిని.

## వీధినాటకములు

నా నాట్యకళాభిమానము వీధి నాటకములను చూచుటతో ప్రారంభ మైనది. బాల్యమున ఈ వీధి భాగవతములన్న నాకు చాలా వెర్రి. మా వూరిలో మద్దెలమీద దెబ్బపడిన శబ్దము వినగనే నేనక్కడ హాజరుగ నుండెడి వాడను. నాకు ఈ పిచ్చి ఎందువల్ల కలిగినదంటే, నాకు ఇద్దరు మేనమామ లుండెడివారు: పెద్ద మామయ్య పేరు ములుకుట్ల మహాదేవయ్య; చిన్న మామయ్య పేరు ములుకుట్ల సుబ్బయ్య. పెద్దవారు చక్కగా పాడనేర్చిన వారు; చిన్నవారు చక్కగా ఆడనేర్చినవారు. మా ఊరికి భాగవతులువచ్చి నాటకములు ఆడునప్పుడు పెద్దమామయ్యగారిని తెరచాటున పాడుటకు పిల్చే వారు. చిన్న మామయ్యను వేషములు వేయుటకు పిలిచేవారు. వీరిరువురితో కూడ నేనును హాజరయ్యేవాడను. వీరి గాలి నాకును కొంత సోకి ఆటపాటల మీద అభిరుచి కలిగియున్నాను.

## నాటకములు

నా కుఱ్ఱతనమున మొట్టమొదట నే జూచినవి హరిజన నాటకములు. ఆ రోజులలో మా వూరి హరిజన/(మాల) వాడనుండి వచ్చి గ్రామమునకు దూరముగ స్థలమును ఏర్పాటుచేసుకొని రామాయణ నాటకమును ఆడేవారు. వారు రాముడు, సీత, లక్ష్మణుడు, హనుమంతుడు మొదలైన వేషములు ధరించి నాటకములాడేవారు. మాసినగుడ్డలను, లక్కరంగు ఆభరణములను ధరించేవారు. కాళ్లకు గజ్జెలుకట్టుకొనేవారు. వాటి ఘల్లుఘల్లునకు తోడు. తాళము తప్పెటలు వీరికి ప్రక్క వాయిద్యములు. పాడునప్పుడు వీరు

అప్పుడప్పుడు తలయెత్తి వెర్రికేకలను వేయుచుందురు. వారు పాడెడువానికి తలాతోకా లేకపోయినను రామాయణకథనే వారిభాషలో కీర్తనలుగా పద్యములుగా తమఇష్టము వచ్చినట్లు కవనముగట్టి పాడేవారు. ఈనాటకములను చూచుటకు ముఖ్యముగా బ్రాహ్మణేతరులే వచ్చేవారు. ఈనాటకములాడు వారు బ్రాహ్మణుల నాశ్రయించరు. వేషములు వేసేవారందరును పురుషులే. సీతా రామలక్ష్మణుల అరణ్యవాసము, లక్ష్మణమూర్ఛ, సీతమ్మ శోకము, వీటినాడుచు ఆయాపాత్ర లభినయించునపుడు అమ్మలక్కలు కంట్లనీళ్లు పెట్టుకొని దుఃఖించేవారు. ఆరాత్రిఅంతయు నాటకము ఆడినందులకు వారికి పదిమందికలిసి సలకవరిగెలను, దివిటీలకు ఆముదమును ఇచ్చేవారు.

ప్రతివూరి సమీపమునను హరిజనవాడలో రెండు తెగలుండును. అందులో ఒకరు రెండవ వారికంటె గొప్పవారమని చెప్పుకొందురు. శ్రీరాముని దేవాలయమును కట్టుకొని రామభజన చేయుచుందురు. వీరిలో హెచ్చుగా భక్తిపరులైనవారు కొందరు ప్రతినిత్యము మొగమునిండ తిరుమణి శ్రీచూర్ణములను; తులసిపేరులను ధరించి భజనకీర్తనలు పాడుచు లౌకిక ప్రసంగములోను మెట్టవేదాంతమును మాట్లాడుచుందురు. వీరిని మాలదాసరు లందురు. మిగతావారును పండుగ పబ్బములకు నామాలు ధరింతురు. వీరు సామాన్యముగ ఊరిలోని కాపులయిండ్ల కమతముచేసి జీవింతురు. మాదిగవారు కసాయిపనులు చేయుచు, చచ్చిన జంతువుల చర్మములు వలిచి చెప్పులు, బావులలో నీళ్లు పొలములకు తోలు మోటబొక్కెనలు కట్టుచు జీవింతురు.

## వీధిభాగవతము

తర్వాత మా గ్రామములో నేను చూచిన వీధి భాగవతములు, ఉత్తమ తరగతివి. ఈ భాగవతము లాడినవారిలో ముఖ్యమైనవి రెండుజట్లు. ఒకటి: మా గ్రామ సమీపముననే తమ్మవరము అని యొకగ్రామమున్నది. ఆ గ్రామమునుండి వచ్చు తమ్మవరపు బోగము వెంకటస్వామి జట్టు. రెండవది కూచిపూడి బ్రాహ్మణుల భాగవతము జట్టు.

వెంకటస్వామి జట్టులో చేరినవారందరు బోగమువారే. పురుషులు పురుషవేషమును, స్త్రీలు స్త్రీ వేషమును ధరించేవారు. వెంకటస్వామి హాస్యమును ప్రదర్శించుటలో చాల మేధావంతుడు. ఆ నాటక సమాజమంతయు వెంకటస్వామి చేతులలోనే యుండినది. వీరు మా ఊరికి వచ్చినపుడు పాత కచ్చేరి సావడిలో బస చేసేవారు. పిమ్మట గ్రామకరణమును మునసబును

దర్శించి నాటక ప్రదర్శనమును యేర్పాటు చేసుకొనెదరు. ఒకనాటిరాత్రి నాటకమునకు ఒక వరహా సామాన్యమైన యేర్పాటు. వీరందరు కలిసి ఇంచు మించు 10 మంది యుందురు. వీరికి ఊరిలో ప్రతియింట నొక్కొక్కరికి భోజనమున పెట్టుదురు. సత్యభామ వేషము వేయుస్త్రీ అందమైనది. కనుక అందరును తమయిండ్లకు ఆమెనే భోజనమునకు పిలుతురు. ఆమె భోజనమునకు వచ్చిన గారెలు, బూరెలు, పరమాన్నములతో కూడ విందు చేసెదరు. అందువలన ప్రతియింటికి సత్యభామయే భోజనమునకు వచ్చునని వెంకటస్వామి కబురు పంపెడివాడు. కనుక జట్టు అందరికీ పిండివంటలతో కూడ విందు జరిగేది. ఆ దినము నాటకమునాడు స్థలము నంతయు, సాయంకాలము ముదాంవెట్టివాండ్రు చిమ్మించి నీళ్లచల్లి బాగుచేయుదురు. సుమారు రాత్రి 10 గంIIలకు నాటకము ప్రారంభమగును. ఊరి ప్రజలందరు వచ్చి కూర్చుందురు. నాటకరంగమునకు ముందు కరణం మునసబులు ఇంక ననేకమంది బ్రాహ్మణులు, కాపులు, రెడ్లు కూర్చుందురు. వేషము యెప్పుడు వచ్చునాయని ఆత్రముతో వేచియుండెదరు. సాధారణముగ వీరు మొదట భాగవతనాటకమునే ప్రదర్శించెదరు. దీనిలో ముఖ్యపాత్రలు కృష్ణుడు, సత్యభామ, గొల్లభామ, సుంకర కొండడు మొదలగునవి. మొదటి వేషము (అది సామాన్యముగా భామవేషమో, రాజవేషమో) తెరచాటునుండి వెలుపలికి వచ్చునప్పుడు రెండు దివిటీలను ఆ వేషము మొగమెదుట మోటించి నిల్పి దానిపై గుగ్గిలపు పొడిని జల్లెదరు. ఆ వెలుతురున తెరలోని వేషము బయట పడును. ఇవి నేడు సినీమారంగమున Still Pose అనియు, నాటకరంగమున Flash Light అనియు చెప్పబడు విశేషముల మాతృకలు అనదగును. సామాన్యముగ తెరగుడ్డకు సభలో కూర్చున్నవారి దెవరిదో యొకరి ది తలగుడ్డడిగి తీసుకొని పట్టుదురు.

ఈ వేషధారులు ధరించి యుండు ఆభరణములన్నియు తేలికకొయ్య మీద చెక్కి కాకిబంగారము అంటించబడినవి. వాటిని ఇప్పుడుకూడ కొండపల్లిలో తయారు చేయుచున్నారు.

ఆ కాలమున సత్యభామ తన జడను తెర ఇవతలవేసిన 'తనను ఈ సభలో ఎవరైనను భాగవత విషయమై ప్రశ్నించినచో జవాబు చెప్పగలను' అని సూచన. ఒక్క భాగవతముననే ఏమి? సామాన్యముగ నీ భామ వేషము వేయు వ్యక్తి, అనాటి సకలశాస్త్రములను తెలిసినదైయుండును. ఈ వేషమున పూర్తిగా యుపన్యసించుటకు ఒకటి రెండు రాత్రిళ్లు పట్టును. అందు శాస్త్రముల నన్నిటిని తడవి వేషధారి తన విద్వత్తు ప్రకటించును. చాలింత యైన దేవకీదేవి పిండోత్పత్తి క్రమము, గర్భరక్షక విధులు, పురిటింట

సన్నాహము, బాలింత పథ్యపానములు, శిశుపోషణ పద్ధతులు - మొదలైనవాని నన్నిటిని ఆయుర్వేద వైద్యశాస్త్రరీత్యా ఉపన్యసించును. సత్యభామ శృంగార రసమందలి సాత్వికావస్థలను, నాయికా నాయక లక్షణములను, ఉపన్యసించును. దీనినే భామకలాపము అందురు. ఇదియొక విధముగ నాటి కాలమున వయోజన విద్యావిధానము అనజెల్లును. పై విధముగా నీ భామ, తన జడను తెరలోపలి నుండి రంగస్థళము వైపున తెరబయటకు జారవిడువగనే సభాసదులలో, ముఖ్యముగ పండితోత్తములకు ఉక్రోషమువచ్చి - "ఏమీ? ఈ సానిది మావంటి పండితులున్నారనియైన తెలుసుకొనకుండ జడ ఇవతల వేసి అవమానించుచున్నదే?" అని ఉగ్రులై చీకాకుపడి, ఆమెను భాగవతములోని పద్యములను కృష్ణకర్ణామృతములోని శ్లోకములను చదివి భావార్థలము చెప్పుమని అడిగెదరు. అవి చెప్పినంతనే విడువక, ఇంకను భరతశాస్త్రము నందును, అలంకారశాస్త్రము నందును ప్రశ్నింతురు. అన్నిటికి జవాబిచ్చినచో హర్షించెడివారు. ఆనాటి బోగముపడుచులు సామాన్యముగ విద్వత్తుకలవారై, పండిత పరిచయమును కలవారుగ నుండిరి. తమ పరీక్షకంతయు తాళినను మరియు నీర్ష్యాపరులు కొందరు మంత్రశాస్త్రము నాశ్రయించి ఆ భామవేషదారికేదైన వికల్పము కల్పించుటయు కలదని వింటిని. సామాన్యముగ ప్రతి జట్టులోను నొక మంత్ర శాస్త్రవేత్త యుండును. అతడు అట్టి సమయముల దానికి ప్రతిక్రియ గావించి సర్దుకొనును.

నాటకము పూర్తిగాకముందు సత్యభామ ముందు కూర్చున్న పెద్ద మనుష్యులొక్కొక్కరివద్దకు వచ్చి కూర్చుండి తనజడను వారివారి మెడలకు చుట్టి రెండుబుగ్గలను వత్తి ఒక జావళి పాడును. అప్పుడతనికి వళ్లు పులకరించి తబ్బిబ్బులయి, తలగుడ్డముడి నుండి ఒకటో రెండో రూపాయలను తీసి భామ చేతిలో వణుకుచు పెట్టును. అప్పుడు వెంకటస్వామి బహుమతి ఇచ్చినవారి పేరుచెప్పి పొగడుచు పద్యములు చదువును. ఈ పద్యములు సామాన్యముగ ఎవరిపేరైన ఇరికించుటకు వీలుగా పూర్వమే వ్రాయబడి కంఠస్థమై యుండును. ఈ ప్రకారము ఆ రాత్రి బహుమతులు సుమారు 20 రూ॥లకు తక్కువ లేకుండ భామవేషధారి సంపాదించును. ఈ సందర్భమును చూచి తరచుగా ఊరి పెద్ద శెట్టి మెల్లగా వెనకకు జారుకొనును. నాటకము తెల్లవారి 5 గం॥ల వరకు జరుగును. అటుపిమ్మట వారందరు ధరించిన వేషములతోనే గ్రామములో ప్రతి యింటికివచ్చి చీరెలను ధోవతులను భిక్షమెత్తెదరు. ఆ కాలమున గుడ్డకరువు లేదుగనుక వారు వేషములను వేయువస్త్రములను సంపాదించుకొనువారు. ముఖ్యముగ వీరు భాగవత నాటకము, హరిశ్చంద్రనాటకము, నలచరిత్ర, ఉషా పరిణయము, ప్రహ్లాదనాటకము మొదలైనవి ప్రదర్శించేవారు. (ఇంకా వుంది

# STATISTICS OF SOUTH INDIAN FILMS

| DUBBING | 1988 STRAIGTH | TOTAL RELEASE | | TOTAL RELEASE | 1989 STRAIGHT | DUBBING |
|---|---|---|---|---|---|---|
| 35 | 97 | 132 | TAMIL | 129 | 99 | 30 |
| 24 | 110 | 134 | TELUGU | 147 | 89 | 58 |
| — | 59 | 59 | KANNADA | 69 | 69 | — |
| 6 | 70 | 76 | MALAYALAM | 77 | 73 | 4 |
| 30 | 21 | 51 | HINDI | 40 | 23 | 17 |
| — | 1 | 1 | TULU | — | — | — |
| 1 | — | 1 | MARATHI | — | — | — |
| — | 1 | 1 | ENGLISH | — | — | — |
| 96 | 359 | 455 | | 462 | 353 | 109 |

CENSORED AND NOT RELEASED

| | IN 1989 STRAIGHT | IN 1989 DUBBING | BEFORE 1989 STRAIGHT | BEFORE 1989 DUBBING |
|---|---|---|---|---|
| TAMIL | 14 | 10 | 88 | 59 |
| TELUGU | 8 | 13 | 100 | 87 |
| KANNADA | 10 | 1 | 91 | 1 |
| MALAYALAM | 21 | 1 | 72 | 7 |
| HINDI | 3 | 5 | 19 | 1 |
| ENGLISH | 1 | — | 1 | — |

COMPILED BY FILM NEWS ANANDAN OF FILM INFORMATION CENTRE
169, Peters Road, Royapettah, Madras-600 014. Phone : 867311

ముఖచిత్రం

# గురుదేవ్ టాగూర్



**మానవ స్వభావంలోనే ఒకవైపు అధికారతృష్ణ మరొకవైపు ప్రేమ భావమూ వున్నాయి. ప్రేమ మార్గాన పయనించే వారికి ఆనందసీమ అనే పూలవనం కనబడుతుంది. అధికారపు బాట, కొండగుహలోని అంధకారంతో తీసుకువెళ్తుంది.**

హిమాలయ శిఖరం గురించి, మానస సరోవరం గురించి ఏం చెప్పగలమో, రవీంద్రనాథ్ ఠాకూర్ గురించీ అంతే. అసలు మన భారతీయ సంస్కృతి, మహానుభావుల జీవిత విశేషాలపట్ల అనవసర కుతూహలం కనబరచదు. ఆమాటకొస్తే వాల్మీకి గురించి మనకేం తెలుసు - ఆయన ఆదికవి అనితప్ప ! తన కవితాధారలో అక్షరాలా అమృత మొలకించిన కాళి దాసు గురించి మాత్రం మనకేం తెలుసు, ఆయన సృష్టించిన పాత్రలు తప్ప ! చదువుల తల్లి సరస్వతి, పద్మాసిని అయిన వీణాపాణి అనడంలో, ఆ సంకేతంలో, ఆ రూపచిత్రణలో, కాంతి కిరణ స్పర్శలోని పద్మవికసితశోభ, రాగలయ బద్ధమగు సుస్వనంలోని నాదోపాసన సమ్మిశితమైవున్నాయి. ఈ భరతఖండపు నాగరికత, ఈ పుణ్య తీర్థాల చరిత్ర - తెలియనివారికి ఈ సంప్రదాయంపై సద్భావంలేని వారికి వాల్మీకి, కాళిదాసు, టాగూరు - కవుల వలెనే కనబడుతారు గాని వారి తేజః ప్రభావం అర్థంకాదు. వాల్మీకి రాముడు దేవుడు. కాళిదాసు - కావ్యం నభూతో నభవిష్యతి, తూర్పు పడమరల మధ్య గోడలున్నాయని ఒకరంటే, అవి గోడలు కావు దినములోని దివారాత్ర ములని ఎలుగెత్తి చాటాడు విశ్వకవి. ఆయన బెంగాలీ భాషలో వ్రాసిన కాసిని పేజీల పుస్తకమూ, దాని ఇంగ్లీషు అనువాదమూ 1912 లో నోబెల్ బహుమాన కమిటీవారు చూసి విస్తుపోయారు. ఇంత పల్చటి పుస్తకా నికా ప్రయిజ్ - అనుకున్నారు. కాని, వలసదేశం నుంచి వెలువడిన యీ విశ్వ గాన రవళి వారిని ఆశ్చర్యాం బుధిలో ముంచింది.

'గీతాంజలి'కి నోబెల్ బహుమతి రాగానే, ఆయనను అభినందించేందుకు బోల్‌పూర్‌లోని శాంతినికేతనానికి పెద్దలూ ప్రముఖులూ ఒక సన్మాన సంఘంగా వస్తారు. అపుడు టాగూర్ అంటారు : ... "బెంగాలీ భాషలో యిన్ని సంవత్సరాలుగా ప్రజలు నా పుస్తకాలు చదవడం లేదా ? ఇప్పుడు

కొత్తగా వారిగిందేమిటి ? యూరప్‌లో గుర్తింపబడిన మీదటగాని, నాకవితకు విలువ లేదా ?" .... ఆ వచ్చినవారిని కొంచెము మందిలిస్తూ. 1908 వంగ విభజన నాటికే, బంకిం చంద్రుని వందేమాతరం ప్రతినోటా గానమై పలుకుతూండే నాటికి, టాగూర్ పాటలు బెంగాలంతా వ్యాప్తమై వున్నాయి. "నా పదాల కూర్పుకి ప్రస్తుతించేవారి కరతాళధ్వనులకు వుబ్బిపోయేందుకు, యీప్రపంచంలోకి నేను కీర్తిని యాచించే బిచ్చగాని వలె రాలేదు. నాతల్లి, అనగా భారత మాత, కన్నీరు తుడవగల కృషికంటె మరొక భాగ్యమేమున్నది ?" అంటూ రాజకీయాలలోకి దూకారు టాగూర్. విద్రోహకరమగు ఉపన్యాసాలు యివ్వ వద్దని బెంగాల్ ప్రభుత్వం ఆయనకు ఒక లేఖ పంపుతుంది. దానికి ఆయన సమాధానం యివ్వరు. అప్పట్లో, ప్రభుత్వం ఆయనను అరెస్ట్‌చేసి వుండ వలసిందేగాని ఎందుకనో చేయలేదు. కొద్దిలో తప్పిపోయింది.

నోబెల్ బహుమతి పొందిన మీదట, లండన్‌లోని భారత కార్యదర్శి మొంటాగో, టాగూర్‌కి అభినందన లేఖ పంపుతాడు. ఆపైన నైట్ హుడ్ యిచ్చి గౌరవిస్తారు. జలియన్ వాలా బాగ్ దురంతాల అనంతరం లార్డ్ ఛెమ్స్‌పర్ట్‌కి ఒక అసమ్మతి లేఖవ్రాస్తూ ఆ బిరుదుని తిరస్కరిస్తారు టాగూర్

నవ భారత నిర్మాతగా టాగూర్ భారతీయ ఆత్మస్వరూపాన్ని తన దేశప్రజలకు, ప్రపంచ ప్రజలకు సాక్షాత్కరింప జేశారు. ఎలాగంటే అప్పట్లో కలకత్తా నగరం భారత రాజకీయాలకూ, సామాజిక చైతన్యానికీ కేంద్రం. 1912 వరకు మనదేశపు రాజధాని అదే. ఇప్పుడందరూ ఢిల్లీ పరుగెడుతున్నట్టే, అప్పుడు కలకత్తా వెళ్ళేవారు. బంకిమ్ చంద్రుని రచనా ప్రభావం భారతీయ భాషలన్నిటి మీదా కనబడుతుంది. రాజారామెూహనరాయ్ సంఘ సంస్కరణోద్యమం దేశమంతటా పాకింది. వివేకానందుని గంభీరవాణి నలుమూలలూ దద్దరింప జేసింది. మైకెల్ మధుసూదన దత్, సిస్టర్ నివేదిత, ద్విజేంద్రలాల్ రాయ్ - యిలా ఎందరినో చెప్పవచ్చు. ఇదంతా వంగభూమిపై, తద్వారా నవభారతంపై పడ్డ ప్రభావం. ఈ నాడు బెంగాల్ అన్నది, రేపు మిగతా భారతావని అంటుంది - అనేమాట కొట్టివేయ దగ్గది కాదు. అటువంటి వంగ ధరిత్రిలో, భారతీయులకి గంగా జలమెటువంటిదో, యీజిప్షియనులకు నైలునదీ, చైనీయులకు యాంగ్జీనది అటువంటిదే సుమా - అనే సుసంపన్నమూ సత్సంప్రదాయ బద్ధమూ అగు టాగూర్ కుటుంబంలో, ధ్యాన యోగంలో వున్నప్పుడు వొంటిమీద పాకే వుడతలనీ, చేతుల మీద వాలే పక్షులనీ సమహితతత్త్వంతో చూడ గల ద్విజేంద్రనాథ్‌కి సోదరునిగా

జన్మించాడు రవీంద్రుడు. సంగీత సాహిత్యాలు ఊయల వూపులుగా ఆయన బాల్యమంతా గడిచింది. తనకు గురుతుల్యుడూ, ఆరాధ్యుడూ అయిన విద్యాపతివలె కవితా రచన గావించాడు పదిపదిహేనేళ్ళ ప్రాయంలోనే! 'పాము నోటిముందు కప్ప చేసే నాట్యమే ప్రేమానుభవం,' అన్న చండీదాస్ గీతాలు, వైష్ణవ భావోద్దీపన టాగూర్ లోని కవితా కన్యను మేల్కొల్పసాగాయి. ఇరవైఏళ్ళు నిండకపూర్వమే యింగ్లండు వెళ్ళాడు. అక్కడ వున్నప్పుడాయనకు ఐసియస్ పాసవాలనీ, బారిస్టర్ అవాలనీ అనిపించలేదు. వేషభాషలలో గాని, ఆహారవిహారాలలోగాని, నిత్య కృత్యపు మాటాపలుకూలోగాని అక్కడి ఆచారాలని వెంటబెట్టుకురాని రవీంద్రుడు, అనాటి వారిలో సంచలనం కలిగించడం సహజం, అప్పటికే ఆయన మనసులో ఒక ఊర్వశి ఉదయిస్తోంది.

ఋగ్వేదంలో - ఊర్వశి ప్రసక్తి వుంది. ఆమె పురూరవునితో అంటుంది .... 'నేను నీ వద్దనుంచి ఈ మహా సృష్టిలోని మొదటి ఉదయంలా వెళ్ళిపోయాను.... మలయానిలం వంటి నన్ను నీవు పట్టుకో లేవు'.... ఊర్వశి ఇంద్రుని దర్బారులో అప్సరస - అంటారు. ఆర్యుల ఇతిహాసానికి ప్రతిరూపమనదగు గ్రీకు ఇతిహాసంలోని 'అఫ్రొడైట్'ని - రోమనులు 'వీనస్' అన్నారు. ఈమె సముద్రపు నురగ నుంచి జన్మించిందని ప్రతీతి. గ్రీకు భాషలోని ఈవాస్.... సంస్కృతంలో ఉష అయింది - అనగా ఉదయ



సంధ్య. కాళిదాసు విక్రమోర్వశీయంలో ఊర్వశి అమరత్వం పొందింది.

రవీంద్రుడు ప్రయోగించినది విశ్వవీణ. వీణానాదంలోని శబ్ద మాధురిని ఆనందించేందుకు ఎటువంటి ప్రశాంత చిత్తం కావాలో, రవీంద్రుని కవితా చిత్రమాలలోని రసాస్వాదనకు అటువంటి నిర్మల మనోమయ వాతావరణమే కావాలి. "తన కంటుకున్న మట్టిని కనబడనీయని బూడిద బట్టల బాటసారి, తన ప్రభువు పూదండ నుంచి పాన్పుపై రాలిన రేకలు వెతికే పడతి, శూన్య గృహంలో కూర్చొని, స్వామిరాక కోసమై ఎదురు చూసే సఖి, లేక, సేవకుడు - ఇటువంటి చిత్రణలో మనకు కనపడేది. మానవాత్మ భగవంతుని పిలిచే పిలుపు,"- అని వై.బి. ఈట్స్ 1912 లో 'గీతాంజలి' కి పరిచయం వ్రాస్తూ అన్నాడు.

వైష్ణవ సంప్రదాయంలో ప్రకృతి పురుషులే జీవాత్మ, పరమాత్మలు, జీవాత్మ పరమాత్మకోసం జరిపే అన్వేషణే జీవితం. 'లవర్స్ గిఫ్ట్' లో అంటారు టాగూర్ :

'నిన్న రాత్రి తోటలో, నీకు యౌవనమధు పాత్రనందించాను. పాత్ర నీ పెదవుల వద్దకు చేర్చుకు, అర్ధ నిమీలిత నేత్రాలతో చిరుహాస రేఖలు చిర్నగవు వెదజల్లగా, నీ మేలిముసుగు తొలగించి, కురులు సర్ది, నీ గంభీర సుందరవదనం నా గుండెలపై నిలుపుకున్నాను. ప్రపంచసుషుప్తిపై చంద్రుని స్వప్నకాంతి పరవళ్ళు తొక్కింది....

'ఈ ఉదయం మంచు తడిలో పరిశుద్ధవై, ధవళవస్త్ర ధారిణివై, పూసజ్జ నిండా పూలు నింపుకు, దేవాలయానికి వెళ్తున్నావు. - నిర్జన పథములో చెట్టు కానుకు అధోవదనుడనై నిలబడ్డాను నేను.'

పై చిత్రణలో నరనారీ హృదయ స్పందన ద్వారా జీవుడూ దేవుడు లీలగా కనబడతారు. పడవని కొయ్యకు కట్టివేసే తాడే, ముందుకు లాగేందుకు కూడా ఉపయోగపడుతున్నట్టు, యింజనూ రైలు బద్దీలు వున్నా స్టేషనులు లేని ప్రయాణం సాధ్యం కానట్లు, వాక్యంలోని ప్రతి అక్షరమూ దేనికది వర్ణక్రమంలో చదివితే వాక్యం బోధ పడనట్లు, సామరస్యమూ సృజనం లేనిదే జీవితకు నిండుతనం లేదంటారు టాగూర్. సృజన అనేది ప్రతి మనిషిలోనూ సహజముగా వుండే చైతన్య భావం. అది లోపించినప్పుడు, సచేతనములకీ అచేతనములకీ అట్టే కనిపించదు. మనుషులు వస్తువులూ ఒకే స్థాయిలో ఉంటాయి. మనచుట్టూ గల లోకంతో మనకు గలది, వ్యక్తిగతమైన బాంధవ్యము. మన ఆనంద విషాదలకు హేతుభూతమే ఈ ప్రపంచం. అంచేత, ప్రపంచంతో నాకేమిపని అని పిచ్చి వాళ్ళొక్కరే అనగలరు. పోతే, యీ ప్రపంచంలోని విషయ బాంధవ్యాలన్నీ సత్యము అనే సూత్రానికి కట్టుబడి వున్నాయి. వాస్తవ బాంధవ్యాలన్నీ హేతువు అనే జ్ఞానానికి కట్టుబడి వున్నాయి. వ్యక్తిగత బాంధవ్యాలన్నీ

ప్రేమ అనే ఆనందానికి కట్టుబడి వున్నాయి. మనం ఈ ప్రపంచంలో వస్తువులమూ. విషయాలమూ కాదు, వ్యక్తులము. కాలప్రవాహంలో కొట్టుకు పోవలసినవారం కాదు. కాలప్రవాహం తో బాటు యీదుతూ, తీరం ఎలా చేరు కోవాలో తెలుసుకోవలసినవారము. అదే సృజనలో గల లక్షణం.

రెండవది సామరస్యం. పాశ్చాత్య జీవితంలో స్పర్థకూ, సంఘర్షణకూగల మూలకారణం. వారి జీవనవిధానం లో గల పోటీ పద్ధతి. అసలు యీ పోటీ పద్ధతిలోనే అధికార సోపాన పంక్తి వుంది. అధికారమనేది ఒక దప్పికవంటిది. ఆ దప్పిక తీరడ మంటూ వుండదు. మానవ స్వభావం లోనే ఒకవైపు అధికార తృష్ణ, మరొక వైపు ప్రేమ భావము వున్నాయి. ప్రేమ మార్గాన పయనించేవారికి ఆనంద మనే పూలవనం కనబడుతుంది. అధికారపు బాట, కొండగుహలోని అంధ కారంలోకి తీసుకు వెళ్తుంది. మనలో సామరస్యం పెంపొందించుకోవడం ద్వారానే, ప్రేమదీపం వెలిగించ గలుగుతాం. దానికి నిరంతర సాధన కావాలి.

వెలుగుతున్న దీపం మూడు విధాల ఆరిపోవచ్చు. చమురు లేక, గాలి వీచి, దీపం పగిలీ! చమురు పోయవచ్చు: ఆరిన వత్తి మళ్ళీ వెలిగించవచ్చు; కాని పగిలిన దీపం ఎందుకూ కొరగాదు. అయితే వెలుగుతున్నంతసేపు దీపం చుట్టూ వెలుతురు [illegible] గాక తన ఉనికికూడ తెలియజేస్తుంది.

'నేను పాడుదామనుకున్న పాట ఈనాటి వరకు పాడడం జరగలేదు. తంత్రులు సరిచేసుకోవడంలోనే రోజు లన్నీ గడిచాయి. అవును - సమయం దగ్గరికొచ్చింది.







సంధ్య. కాళిదాసు విక్రమోర్వశీయంలో ఊర్వశి అమరత్వం పొందింది.

రవీంద్రుడు ప్రయోగించినది విశ్వవీణ. వీణానాదంలోని శబ్ద మాధురిని ఆనందించేందుకు ఎటువంటి ప్రశాంత చిత్తం కావాలో, రవీంద్రుని కవితా చిత్రమాలలోని రసాస్వాదనకు అటువంటి నిర్మల మనోమయ వాతావరణమే కావాలి. "తన కంటుకున్న మట్టిని కనబడనీయని బూడిద బట్టల బాటసారి, తన ప్రభువు పూదండ నుంచి పాన్పుపై రాలిన రేకలు వెతికే పడతి, శూన్య గృహంలో కూర్చొని, స్వామిరాక కోసమై ఎదురు చూసే సఖి, లేక, సేవకుడు - ఇటువంటి చిత్రణలో మనకు కనపడేది. మానవాత్మ భగవంతుని పిలిచే పిలుపు,"- అని వై.బి. ఈట్స్ 1912 లో 'గీతాంజలి' కి పరిచయం వ్రాస్తూ అన్నాడు.

వైష్ణవ సంప్రదాయంలో ప్రకృతి పురుషులే జీవాత్మ, పరమాత్మలు, జీవాత్మ పరమాత్మకోసం జరిపే అన్వేషణే. జీవితం. 'లవర్స్ గిఫ్ట్' లో అంటారు టాగూర్ :

'నిన్న రాత్రి తోటలో, నీకు యౌవనమధు పాత్రనందించాను. పాత్ర నీ పెదవుల వద్దకు చేర్చుకు, అర్ధ నిమీలిత నేత్రాలతో చిరుహాస రేఖలు చిర్నగవు వెదజల్లగా, నీ మేలిముసుగు తొలగించి, కురులు సర్ది, నీ గంభీర సుందరవదనం నా గుండెలపై నిలుపుకున్నాను. ప్రపంచసుషుప్తిపై చంద్రుని స్వప్నకాంతి పరవళ్ళు తొక్కింది....

'ఈ ఉదయం మంచు తడిలో పరిశుద్ధవై, ధవళవస్త్ర ధారిణివై, పూసజ్జ నిండా పూలు నింపుకు, దేవాలయానికి వెళ్తున్నావు. - నిర్జన పథములో చెట్టు కానుకు అధోవదనుడనై నిలబడ్డాను నేను.'

పై చిత్రణలో నరనారీ హృదయ స్పందన ద్వారా జీవుడూ దేవుడు లీలగా కనబడతారు. పడవని కొయ్యకు కట్టివేసే తాడే, ముందుకు లాగేందుకు కూడా ఉపయోగపడుతున్నట్టు, యింజనూ రైలు బద్దీలు వున్నా స్టేషనులు లేని ప్రయాణం సాధ్యం కానట్లు, వాక్యంలోని ప్రతి అక్షరమూ దేనికది వర్ణక్రమంలో చదివితే వాక్యం బోధ పడనట్లు, సామరస్యమూ సృజనం లేనిదే జీవితకు నిండుతనం లేదంటారు టాగూర్. సృజన అనేది ప్రతి మనిషిలోనూ సహజముగా వుండే చైతన్య భావం. అది లోపించినప్పుడు, సచేతనములకీ అచేతనములకీ అట్టే తేడా కనిపించదు. మనుషులు వస్తువులూ ఒకే స్థాయిలో ఉంటాయి. మనచుట్టూ గల లోకంతో మనకు గలది, వ్యక్తిగతమైన బాంధవ్యము. మన అనంద విషాదలకు హేతుభూతమే ఈ ప్రపంచం. అంచేత, ప్రపంచంతో నాకేమిపని అని పిచ్చి వాళ్ళొక్కరే అనగలరు. పోతే, యీ ప్రపంచంలోని విషయ బాంధవ్యాలన్నీ సత్యము అనే సూత్రానికి కట్టుబడి వున్నాయి. వాస్తవ బాంధవ్యాలన్నీ హేతువు అనే జ్ఞానానికి కట్టుబడి వున్నాయి. వ్యక్తిగత బాంధవ్యాలన్నీ

ప్రేమ అనే ఆనందానికి కట్టుబడి వున్నాయి. మనం ఈ ప్రపంచంలో వస్తువులమూ. విషయాలమూ కాదు, వ్యక్తులము. కాలప్రవాహంలో కొట్టుకు పోవలసినవారం కాదు. కాలప్రవాహంతో బాటు యీదుతూ, తీరం ఎలా చేరుకోవాలో తెలుసుకోవలసినవారము. అదే సృజనలో గల లక్షణం.

రెండవది సామరస్యం. పాశ్చాత్య జీవితంలో స్పర్థకూ, సంఘర్షణకూగల మూలకారణం. వారి జీవనవిధానంలో గల పోటీ పద్ధతి. అసలు యీ పోటీ పద్ధతిలోనే అధికార సోపాన పంక్తి వుంది. అధికారమనేది ఒక దప్పికవంటిది. ఆ దప్పిక తీరడమంటూ వుండదు. మానవ స్వభావంలోనే ఒకవైపు అధికార తృష్ణ, మరొకవైపు ప్రేమ భావము వున్నాయి. ప్రేమ మార్గాన పయనించేవారికి ఆనందమనే పూలవనం కనబడుతుంది. అధికారపు బాట, కొండగుహలలోని అంధకారంలోకి తీసుకు వెళ్తుంది. మనలో సామరస్యం పెంపొందించుకోవడం ద్వారానే, ప్రేమదీపం వెలిగించ గలుగుతాం. దానికి నిరంతర సాధన కావాలి.

వెలుగుతున్న దీపం మూడు విధాల ఆరిపోవచ్చు. చమురు లేక, గాలి వీచి, దీపం పగిలీ! చమురు పోయవచ్చు: ఆరిన వత్తి మళ్ళీ వెలిగించవచ్చు ; కాని పలిగిన దీపం ఎందుకూ కొరగాదు. అయితే వెలుగుతున్నంతసేపు దీపం చుట్టూ వెలుతురు చిమ్మడమే గాక తన ఉనికికూడ తెలియజేస్తుంది.

'నేను పాడుదామనుకున్న పాట ఈనాటి వరకు పాడడం జరగలేదు. తంత్రులు సరిచేసుకోవడంలోనే రోజులన్నీ గడిచాయి. అవును - సమయం దగ్గరికొచ్చింది.

'పదాలు సరిగా పడటం లేదు. గుండెలు పిండే వేదన ఒక్కటే మిగిలింది.

'మలయానిలం నిట్టూరుస్తున్నది. కాని పుష్పమింకా వికసించలేదు.

'ఆయన మోము నేను చూడలేదు. కంఠం నేను వినలేదు. నాయింట్లో నేనుండగా వీధులోనుంచి ఆయన మృదు చరణాల అలికిడి మాత్రము చెవుల బడింది.

'రోజంతా, ఆయనకు పుష్పాసనం తయారు చేయడంలో గడిచిపోయింది. దీపం ముట్టించకుండానే ఆయనను లోనికి ఎలా రమ్మనగలను ?

'ఆయన దర్శన భాగ్యంకోసమై వేచి వున్నాను కాని, ఆ కోరిక తీరేదెప్పుడో?'

రవీంద్ర కవీంద్రులు ఆవిధంగా మానస వీణపై విశ్వమోహన గీతిక నాలపించారు. గురుశిష్య బాంధవ్యం లో ఒక నూతనాధ్యాయానికి నాందీ వాక్యం పలికి, శాంతినికేతనంలో విశ్వ భారతిని నిర్మించారు. ఇప్పుడైతే, అడుగడుక్కీ ప్రచారోద్వేగంతో కూడిన శాంతి పావురాలు, శాంతి సందేశాలూ గాని రవీంద్రనాథ్ ఠాగూర్ ఏనాడో అన్నారు: రక్త సాంద్రానికి ఆవల. శాంతి తీరమెక్కడ వున్నదో ఎంత శక్తివంతమైన టెలిస్కోపూ చూపలేకుండా వున్నదని.

అందుకు కారణం ఒక్కటే అంటారు టాగూర్ - అధికారంతో కూడిన ఆత్మగర్వం. అధికార శక్తి అనేక నాగరికతలకు స్వస్తివాచకం చెప్పిందనీ, ఆ శక్తినిగాక సామరస్యాన్ని నమ్ముకుంటే యింతటి రక్తపాతం సంభవించదనీ సర్వమానవ సౌభ్రాతృత్వనినాదానికి ముందు ఆత్మ పరిశీలన అవసరమనీ అంటారాయన.

నవభారత నిర్మాతగా రవీంద్రనాథ్ ఠాగూర్ ఏం చేశారు ? ఈ నిద్రాణ జాతిని ఎలా మేల్కొల్పారు ?

ఎక్కడైతే మనసుకి భయసంకోచాలు లేకుండా, ధైర్యంగా తలఎత్తుకు తిరగగలమో.

'ఎక్కడైతే విద్యావిజ్ఞానాలు అడగటమే తడవుగా లభ్యమవుతాయో

'ఎక్కడైతే లోకం స్వజనసంకుచితపు గోడలతో ముక్క చెక్కలు కాదో

'ఎక్కడైతే నిత్య కుహరం నుంచి మాటలు వెలువడుతాయో

'ఎక్కడైతే నిర్విరామకృషి విశిష్ట పథం వైపు చేతులు చాపుతుంతో

'ఎక్కడైతే నిష్కల్మష హేతు జ్ఞానవాహిని నిర్జీవపుటలవాటు అనే ఎడారి యిసుకలో ఇంకిపోదో

'ఎక్కడైతే ఈ మనసు, ఆలోచన, ఆచరణవల్లను విశాలమవుతూ నీవల్ల ముందుకి నడవబడుతున్నదో

'ఆ స్వాతంత్ర్య స్వర్గసీమ వైపుగా, ప్రభూ, ఈ దేశాన్ని మేల్కొల్పు.'

—యన్నార్ చందూర్

**(1968 నాటి రచన)**

✷

# A Week in Kerala

*Wednesday - July 27 1988*

We were to leave Ernakulam by eight-thirty, soon after breakfast, but in spite of best efforts it was past ten by the time we got into the vehicle with our luggage. It was scheduled that we were to stay at the Malampuzha Dam Guest House for the night and return by next afternoon to Ernakulam. That Dam is 14 km from Palghat where we had our cup of coffee yesterday morning. We had to motor 153 km to reach Palghat, touching Trichur after 74 km. We didn't stop on way and as the road was fine, we could reach Palghat by one in the afternoon. Accommodation for the four of us was provided at Deva Prabha. Each room had an interesting name and Sivaswamy enjoyed reading out the names of those *apsaras* and appreciated the fertile imagination of the hotel owners. While we men were prepared to put up with a certain amount of inconvenience, the two ladies were unhappy with the atmosphere and the untidy manner in which the rooms were kept.

When we came to the dining hall and ordered food, it came after a considerable time. And that was boiled rice to which we were not accustomed to. Radha was upset at the manner in which the food was served. "I won't take a morsel of this," she declared and went to the wash-basin to wash her hands. The concerned man in the dining hall was dismayed and he pleaded that he would serve raw rice with fresh vegetables within fifteen minutes. "Get me some bread, that is enough" she said and we waited for about half-an-hour for that bread to arrive. In the meantime Siva Swamy's assistant suggested that he would take us to Indra Prasta - a star hotel - one star or three stars, I don't know.

It was a welcome change and we felt quite at home in Indra Prasta. Our luggage was at Deva Prabha and we would collect it at the time of our departure to the dam site. As it was nearing three we ordered *idli* and *upamav* and the tiffin was quite tasty. Siva Swamy chided his subordinate

for not bringing us to this place at the first instance itself.

While taking tiffin Malati said : "Siva Swamy Garu, here there are no *apsara* name-plates - the rooms carry bald numbers. As in Deva Prabha there are no Menakas, no Rambhas, no Tilottamas. You were so enchanted with those names and that was the reward we got."

"You are absolutely correct Malati Garu - names are not be trusted, they may be deceptive," agreed Siva Swamy.

While the three of us were relaxing on cosy beds, Siva Swamy went out for a while on official work. And we were to leave for Malampuzha Dam by five and reach that place before dark. On way we stopped at Deva Prabha to collect our luggage and the owner of the hotel happened to be there. After expressing profound regrets for what had happened in the afternoon, he went on explaining to us about several rare plants in the compound and he gave some nuts, *Jajikaya, Japatri* etc. to the ladies. Both Radha and Malati appreciated his taste in horticulture.

At the Dam Guest House we were provided with two a/c suites and the three of us with the help of the driver went to the dam site, while Siva Swamy was drowned in his files. This Malampuzha Dam was inaugurated by Pundit Jawaharlal Nehru in 1950. You can drive on the dam without any hindrance and provision was made to give way to the car coming in the opposite direction. There is a beautiful park and a Japanese garden. You can ask for the illumination at a cost of Rs. 150/- for thirty minutes. There is a hanging bridge - just like Lakshmana Jhoola. This dam site is a picnic spot with lots of crowds on weekends and holidays.

*Thursday - July 28, 1988*

When we woke up to the chirping of birds and a pleasant morning breeze with a mild scent of the flowers, there was a tap at the door and the server brought in a pot of hot coffee. The aroma of the beverage had contributed to the exhilarating atmosphere of the morning.

After coffee, we went upstairs to watch the dawn emerging and enjoy the beauty of unsullied nature. Our guest house was on the top

of a hillock and almost all the trees had caps of dew. The horizon was cloudy and to our right we could find a blue ribbon of water with some moving objects - excursion boats. There was no reddish tinge on the eastern sky but the clouds started moving off slowly to herald the dawn. Mist was evaporating and the light was spreading but there was no trace of Sun's rays. The Dam over which we motored last night, the hanging bridge whereon we walked, the greenery, the beautiful park - all these were becoming visible. On our right, we could find the achievement of Man while on our left it was Nature's bounty. Suddenly Radha appeared and said: "Oh, you are here, immersed in observing the beauty of Nature." Shakespearen saying flashed in my mind: 'One touch of nature makes the whole world kin.'

After bath and breakfast we had a hurried round of the dam site again, while Siva Swamy was with his papers. Malati was quite elated with this unique experience but Radha had a grouse: "We couldn't have a boat-ride".

"Tomorrow you will have at Cochin."

"That is different," she said with a bit of disappointment.

Trichur (on way to Ernakulam) is famous for Vedakkunathan Temple. A Shaivite shrine known to be there since the 8th century and the Pooram Festival that falls on Shiva Ratri Day is very popular in drawing mammoth crowds. Further this place is well-known for Ayurvedic herbs. The Umbrella Competition with decorated elephants is celebrated on the Pooram and we feel thrilled while watching it on the TV.

At the Fort of Hyder Ali, we spent a few minutes. Built in 1766 by Hyder Ali, it was usurped by the British and remodelled in 1784 according to European military standards. When you walk around those ramparts, your mind trangresses all time - sense and plunges into historical past. Dreams of mighty monarchs and powerful rulers - dreams merry and sad - of marble halls with vassals and serfs, they crumble to brick and mortar. This was the fort from which the British could successfully fight Tippu Sultan. As it stands, the place is occupied by some government offices.

In 1776, Hyder Ali, the Ruler of Mysore brought Cochin under his suzerainty. And in 1791, the King of Cochin had to come to terms with the East India Company. In 1684 itself the British sottled down in Travancore, by obtaining concessions from the Queen of Attingal. The Portugese got a foothold in 1502 and the Dutch in 1663 Thereafter the usual story of colonial expansion.

Christianity came to Kerala about nineteen centuries back with St. Thomas the Apostle arriving there. Kerala has three major periods of development (historically speaking). and Marthanda Verma (1729-1798) of Travancore is held in high esteem. After Independence, the princely states of Cochin and Travancore got merged into and with the Malayalam - speaking area of Malabar added, the present State of Kerala was formed with 576 kms in length and 32 to 120 kms in width, spreading about 39 thousand sq kms. in area. The present population is about 27 million and the literacy rate more than 70 per cent.

We reached Ernakulam by one. in the afternoon and Siva Swamy left for his office. Radha and Malati vied with each other in preparing hot delicious food. We had a sumptuous meal, had a good nap and by the time we opened our eyes for the evening tea, it was raining - as they proverbially say, cats and dogs.

And in the night Siva Swamy's friend from Madras took us for dinner to a posh hotel where we could relish very little while the bill he paid was exorbitant. That was a way of life.

*Friday - July 29, 1988*

No trip to Kerala is complete without a boat cruise in the backwaters of Cochin. Two tours are conducted daily by the Kerala Tourism Department. It is a very comfortable journey with cushioned seats in the interior and deck chairs on the top. You can go on changing places as you fancy-nobody questions you. The trip covers Dutch Palace and Synagogue at Mattancherry, Chinese Fishing Nots and St. Francis Church at Port Cochin, Gundu Island and Bolgatty Island.

On the first day itself, as we had seen the earlier four (we had a glimpse of the Dutch Palace as well while returning from Synagogue), we

were not keen on going ashore at Mattancherry and Port Cochin. Gundu Island is one of the smallest islands around Cochin with an area of barely five acres accommodating a coir factory run by a co-operative society.

Radha said: "Not that we do not get these mats at Madras. But having come all the way, we should carry a few to remind us of this pleasant visit." Needless to say Malati shared the same view and they purchased as many as they could carry.

When we came to Bolgatty Palace in the 15-acre lush-green island of the same name, it was a feeling of entering the world of aristocracy - an aristocracy of the 18th and 19th centuries - before the advent of the railroad. The prince who built this magnificent palace must be a great lover of beauty who could hear the celestial song in the rumbling of leaves and the ripples of waves. Just like most palaces in the country, this is a star-hotel now - a five star hotel, I was told, "We must be here for a couple of days to be in tune with the surroundings" observed Radha.

"I also feel like that" said Malati.

While they were deeply absorbed in their own pleasant thoughts, the bearer fetched tea and biscuits.

We roamed about the place for ten minutes, came across the Bangalore Telugu Couple of Krishna District whom we chanced to meet earlier in the journey, and got into the boat.

In the evening a get-together was arranged at Woodlands by the members of the Andhra Association in Cochin. Introducing the Chendur Couple, Siva Swamy paid high compliments and after a few speeches, Malati Chendur replied suitably thanking them for the honour they had done to us. It was a nice, pleasant function and the memento they presented us - a rowing boat in ebony with a number of boatmen in white with rudders - a beautiful piece of art - is before me in the glass case while I write these lines. As I look at it - so many faces familiar and not that familiar - cross my mind and we are deeply grateful for the affection showered on us.

Next morning at eight-thirty we were to leave for Trivandrum.

**—NR Chendur**

*(to be continued)*

?

"Dad, womenfolk would never condone Rama, for banishing Seeta when she was in the family way. How could he pay heed to the slanderous talk of an uncouth washerman?"

"Oh, Raghu, that was simply a silly story circulated to satisfy the unrefined and the uneducated."

"I know you have an explanation up the sleeve. You consider Rama, as the Lord of the Universe in spite of his several shortcomings," said Raghu.

"They are no shortcomings at all. Kaushalya asked Seeta to narrate the experiences of *Vana Vasa.* And Seeta narrated in detail. When it came to the description of Ravana, at the request of Kaushalya, she drew that ghastly figure on the canvas and that drawing Rama chanced to see from behind. To erase that figure from her mind, he sent her to Valmiki Ashram. She would naturally feel the pangs of separation and start pining for Rama. Lakshmana just obeyed his elder brother and the royal household thought that Seeta was being to sent to greenwoods at her request and Valmiki was no stranger to them. This episode is from Uttara Rama Charitra - not from the original Valmiki."

---

*Swadharma Swaarajya Sangha (Director : BVSS Mani*
*Beehive Bldgs - 29, Prakasam Road, Madras - 600 103*



3

## మే 22, 1990

"యుగొస్లావియా పట్ల నాకు ప్రత్యేక అభిమానం ఎందుకంటే: మార్షల్ టిటో - అలీన రాజ్య సమాఖ్యకు మూలపురుషులలో ఒకడు- స్టాలిన్ వుక్కు పిడికిలి నుంచి తమ దేశాన్ని బయటికి లాగ గలిగిన ధీశాలి. మార్షల్ టిటో కారణంగానే యుగొస్లావియా పట్ల నాకు ఆసక్తి పెరిగింది. అయితే, ఏడెనిమిదేళ్ల క్రితం చదివిన ఒక పుస్తకం, అంతా సవ్యంగా జరగడం లేదేమోనని అనిపింప జేసింది. ఏమైనా నేటి యుగొస్లావియా గురించి, వారి సాంస్కృతిక సలహాదారు వ్లాడిమర్ నెసిక (Yugoslavia Today by Vlademir Nesic) చెప్పనున్నది విందాము," అన్నారు, ఆదర్స్‌గిల్డ్ మద్రాసు చాప్టర్ వారు, రాజాజీ లైబ్రరీలో ఏర్పాటు చేసిన సమావేశానికి అధ్యక్షత వహించిన చిత్రా నారాయణస్వామి. ఉత్తరాదివారు దాక్షిణాత్య భాషలకు సముచిత గౌరవం యివ్వడం నేర్చుకోవాలి - అన్నారు స్వాగతం తెలిపిన యస్ వియస్.... "యుగొస్లావియా దేశం అయిదుజాతుల కూటమిగా ఏర్పడింది. ఒకే భాష, ఒకే సంస్కృతి కాదు. మా పార్లమెంటు సభ్యులు అయిదు భాషలలో మాట్లాడుతారు. మా రాజ్యాంగ శాసనం, యించుమించు మీ రాజ్యాంగ శాసనమంత పెద్దది. మీకు మల్లేనే మేమూ ఎన్నో సవరణలు చేశాము - చేస్తున్నాము. మార్షల్ టిటోకి అస్వస్థత ఏర్పడేదాకా, పరిపాలన ఎంతో సవ్యంగా, సాఫీగా వెళ్లిపోతూండేది. దేశం మొత్తానికి రాజకీయపార్టీ ఒక్కటే అయినప్పటికీ, ప్రజలు ఎటువంటి యిబ్బందులూ లేకుండా సుఖశాంతులతో జీవించేవారు. టిటో అనారోగ్యంతో 'పవర్‌స్ట్రగుల్' ప్రారంభమయింది. దాని ప్రభావం ప్రజాజీవితం మీద కూడా పడింది. భారీపరిశ్రమలు ప్రభుత్వం చేతిలో ఉన్నప్పటికీ, ప్రయివేట్ సెక్టార్‌లో చిన్న తరహా ఉత్పత్తులు, వ్యాపారాలు ఉండేవి. మల్టీ పార్టీ సిస్టమ్, వోపెన్ మార్కెట్ - ఈ రెండూ ఉంటే తప్ప, యూరోపియన్ కమ్యూనిటీలో జాయినవడానికి వీలులేదు. ఇవి ఆచరణలో పెట్టిన మీదటగాని, సభ్యత్వ విజ్ఞాపనని

పరిశీలించరు కమ్యూనిటీ పెద్దలు. నేటి యుగొస్లావియాకి యిటుగా మొగ్గడం కంటె మరోమార్గం లేదు. దేశంలోని ఇన్‌ఫ్లేషన్ రేటునిబట్టి మా నెలసరి వేతనాలు, ఏనెలకానెల మారుతూ వుంటాయి. ఈ నెలలో పదిశాతం ఎక్కువ రావచ్చు, పైనెలలో పన్నెండు శాతం తక్కువ రావచ్చు - చెప్పలేము. .... మల్టీ పార్టీ సిస్టమ్ వల్ల ఆవేశాలు, ఆర్భాటాలు, అశాంతి, గమ్యరహితమగు అలజడి, ఆందోళన కొంత పెరుగుతున్నప్పటికీ, యిది ఒకరకంగా నూతనోత్సాహానికి, [illegible] ప్రజాస్వామిక విజయానికి దారితీస్తోంది. అధిక ప్రాపకం గల పార్టీ, ఇప్పటికీ కమ్యూనిస్ట్ పార్టీయే ! .... వోపెన్ మార్కెట్ అనగానే మల్టీ నేషనల్స్‌కి తప్పనిసరిగా అవకాశమివ్వాలి. ముఖ్యమైన రెండు షరతులూ వొప్పుకున్న మీదటగాని, యూరోపియన్ కమ్యూనిటీ సభ్యత్వం లభించదు ; అది లేకపోతే మాకు అరికోన్నతిలేదు" - అన్నారు వ్లాడిమర్ నెసిక్. ఆ పైన శ్రోతల ప్రశ్నలకు సమాధానాలు చెప్పారు. ప్రశంసింపదగు నిర్భీతి, నిజాయితీగల ప్రెస్ ఆఫీసరాయన.

## జూన్ 03, 1990

ప్రభాకర్ దంపతుల కుమారుడు చి॥ హర్షకు, కృష్ణమూర్తి దంపతుల కుమార్తె సౌ॥ పద్మప్రియకు, ఈ ఉదయం ఏడూ ఎనిమిదిన్నర మధ్య, మైలాపూర్ వెంకటేశ అగ్రహారంలోని 'శ్రీ వేదాంత దేశిక నిలయం' కళ్యాణ మండపంలో, శాస్త్రోక్తంగా వివాహం జరిగింది. ఉదయం, ముహూర్తానికీ, సాయంత్రం రిసెప్షన్‌కీ బంధుమిత్రులనేకులు వచ్చి నూతన వధూవరులను ఆశీర్వదించారు.

## ..... 04

ఆర్‌వియమ్‌కె ప్రసాద్, గృహలక్ష్మీ దంపతుల కుమార్తె సౌ॥ మాధవికి, కోయంబత్తూరు లక్ష్మీమిల్స్ మేనేజింగ్ డైరక్టరు రాజగోపాల్ కుమారుడు చి॥ గోపీనాథ్‌కి, ఈ ఉదయం ఆరున్నరకి విజయాశేష్‌మహల్‌లో ఎంతో వైభవంగా, సశాస్త్రీయంగా, సత్సంప్రదాయబద్ధంగా వివాహం జరిగింది. ఆహూతులందరినీ వధువు తరఫువారు, వరుని తరఫువారు ఎంతో గౌరవమర్యాదలతో రిసీవ్ చేసుకున్నారు. మురళిగారు (వధువు తండ్రి), మిత్రులందరినీ ఆప్యాయంగా పలకరించారు. ఏడుంపావుకి హెవీ బ్రేక్‌ఫాస్ట్.... సాయంత్రం రిసెప్షన్‌కి బాలమురళీకృష్ణ గాన సుధాలహరి. తను పాడదలుచుకున్నవీ,. శ్రోతలు కోరినవీ పాటలతో రెండు గంటలసేపు సంగీత స్రవంతి. ఆపైన హెవీ డిన్నర్ - గడ్డపెరుగు, రుచికరమైన అయిస్‌క్రీమూతో. సౌ॥ మాధవి (యమ్‌బిబియస్), ప్రఖ్యాత దర్శక నిర్మాత యల్‌వి ప్రసాద్ మనుమరాలు - కూతురు కూతురు.... చూడముచ్చటగావున్న ఈ నవదంపతులకు మా శుభాశీస్సులు, శుభాకాంక్షలు.

. . . . 06

"తుపాను బాధితుల సహాయనిధికి తెలుగు చలనచిత్ర పరిశ్రమ 20 లక్షలు సమర్పించనున్నది - అందులో 11 లక్షలు వసూలయాయి ; మిగతాది వసూలవుతోంది.... జూన్ 10వ తేదీన హైదరాబాదు లాల్ బహదూర్ స్టేడియమ్‌లో జరుగనున్న స్టార్ క్రికెట్ పోటీలో తెలుగుతారలూ హిందీ తారలూ ప్రముఖులందరూ పాల్గొంటారు. అనాటి స్టార్ నైట్‌తో తెలుగు ఫిలిమ్ కళాకారుల రంగస్థల ప్రదర్శనలు వుంటాయి. క్రికెటూ, స్టార్ నైట్‌తో రెండూకలిపి ఒక కోటిరూపాయలకు తక్కువ గాకుండా, వసూలవుతుందని అనుకుంటున్నాము. రాష్ట్ర ప్రభుత్వ ప్రోత్సాహంతో ప్రభుత్వపరంగా జరుగుతోందిది. మంత్రి హన్మంతరావుగారు ఈ విషయంలో అందరినీ కూడ గట్టుకు వచ్చారు." - అన్నారు దాసరి నారాయణరావు, శ్రీలేఖా ఇంటర్నేషనల్‌లో, ఈ సందర్భంగా ఏర్పాటైన ప్రతికా సమావేశంలో.

శాండిల్య మాట్లాడుతూ, తను ప్రభుత్వానికీ, పరిశ్రమకీ మధ్య సమన్వయకర్తను మాత్రమేనన్నారు .... "32 చిత్రాలకు రావల్సిన సబ్సిడీ గురించిన ఫైళ్ల పరిశీలించి, ఆ మొత్తం తొందరగా మంజూరు చేయించమని కోరారు. పరిశీలనకు సంబంధించి ఒక కమిటీ వుండేది - ప్రస్తుతం అది రద్దయింది. కమిటీ లేకుండా నిర్ణయం తీసుకోగల







అవకాశమున్నదీ లేనిదీ అధికారులు తేల్చిచెప్పాలి. 'నెల్లాళ్లలోనో రెండు నెలల్లోనో ఈ పని పూర్తి చేయగలను' అని టైమ్ లిమిట్ పెట్టి, హామీ యివ్వలేను," అన్నారు ఫిలిమ్‌శాఖా మంత్రి హన్మంతరావు. అలా స్పష్టంగా సూటిగా చెప్పడం అభినందనీయమగు విషయం.

. . . . . 15

"ఫిలాసఫీ అనేది చాలావరకు సిద్ధాంతపరమూ గ్రంథస్థమూను - దైనందిన జీవితమేమో లౌకికమూ, భౌతికమూను. ఆలోచించ గల సామర్థ్యం నుంచే జ్ఞానం జనిస్తుంది. ఏది చేయడమో, ఏది చేయకుండా వుండటమో నిర్ణయించేది జ్ఞానం. పశు పక్ష్యాదులకు మనిషికి వుండే 'జ్ఞానం' లాటిది లేదు గనక అవి తమ 'ఇన్ స్టింక్ట్స్' ప్రకారం నడుచుకుంటాయి. 'జ్ఞానఫలం' మనిషిని అంతరిక్షానికీ ఎక్కిస్తుంది; అధఃపాతాళానికీ తొక్కు తుంది. ఆలోచన, ఉచితానుచితాలు, నేర్పుతుంది. ఈ నేర్చుకోవడంలోనే కష్టసుఖాలు, సంతోష విచారాలు కలుగుతాయి. సెక్యులర్, స్పిరుచ్యు యల్, ఎటర్నల్ అని సమస్త విలువ లనీ మూడు తరహాలుగా విభజిస్తుంది భారతీయ తత్త్వసారం: అర్థము, కామము - సెక్యులర్; ధర్మము, మోక్షము - స్పిరిచ్యుయల్. ధర్మము అనే మాటకు మన ప్రాచీను లిచ్చిన విస్తృతార్థం, మనిషి నడవడికను అన్ని కోణాల నుంచి శాసిస్తుంది. మోక్షము అనగా బంధాల నుంచి విముక్తి. ఆర్థికావసరాలు, కామితాలుతో వ్యక్తి ఎంత సద్వర్తనుడైనప్పటికి, జీవితంలో బంధాలు తప్పవు. ఈ బంధాలు తృప్తి నిస్తున్నట్లనిపిస్తూ, అసంతృప్తికి దారితీస్తాయి. మనోవేద నల నుంచి బయట పడటమే మోక్షము. సచ్ఛీలము, మంచితనము - యివి ఎటర్నల్ వాల్యూస్. శిక్షణ వల్ల ఆలోచనలను అదుపులో పెట్టు కోవచ్చు. అహంప్రవృత్తిని అరికట్ట డం వల్ల యితరుల సంతోషాన్ని పంచుకోవచ్చు. నిత్యజీవితంలోని సాధనామృతమే ఇండియన్ ఫిలాసఫీ" – అన్నారు జస్టిస్ పి వేణుగోపాల్, పొట్టి శ్రీరాములు హాలులో శ్రీ శ్రీ సప్తమి వర్థంతి సందర్భంగా! శ్రీ శ్రీ మెమోరియల్ ఇన్‌స్టిట్యూట్ మద్రాసు శాఖ, జస్టిస్ వేణుగోపాల్ అధ్యక్షులుగా, మద్రాసు యూనివర్సిటీలో ఫిలాసఫీ ప్రొఫెసర్ దేవదాసు ముఖ్య వక్తగా, ఈ వర్థంతి సమావేశం ఏర్పాటు చేశారు. మల్లిక్ స్వాగత వచనం చెప్పిన మీదట, రాజాలక్ష్మి ఫౌం డేషన్ అధ్యక్షులు పివి రమణయ్యా రాజా, ముఖ్యులిద్దరినీ సన్మానించారు. (రాజాలక్ష్మి ఫౌండేషన్ నెలకొల్పిన మొదటి సంవత్సరపు అవార్డు గ్రహీత శ్రీ శ్రీ) మెమోరియల్ ఇన్‌స్టిట్యూట్, వారు, బియస్సార్ కృష్ణ ద్వారా, రమణయ్యా రాజాను సన్మానించారు .... 'ఈతోస్ అండ్ ఈస్తటిక్స్' (Ethos and Aesthetics) అనే విషయంపై ప్రొఫెసర్ దేవదాసు,

శ్రీ శ్రీ మెమోరియల్ లెక్చరిచ్చారు. "శ్రీ శ్రీ తో నాకు వ్యక్తిగత పరిచయం లేదు. కాని, ఆయన ఎటువంటి మహా కవో నాకు తెలుసు. ఎంతటి గొప్ప కవీ తన సమకాలీన సమాజం నుంచి స్ఫూర్తిని పొంది, రసప్రపూర్ణ భావో ద్దీపనతో తాత్వికుడవుతాడు .... ఫిలా సఫీలో రసాభినివేశం లేకపోలేదు. కాని, అక్కడితో ఆగదు. రసాస్వాద నకు అతీతమైన సాక్షాత్కారం వైపు పరుగులిడుతుంది .... రజ్జు సర్ప భ్రాంతిలో, ఆ భ్రాంతి అనుభవంతో గాని తొలగదు. మన ఇండియన్ ఫిలా సఫీ, ప్రత్యక్ష, పరోక్ష ప్రమాణాలు ఆమోదిస్తూ, నైతిక సూత్రాలతో జీవన సరళిని కట్టివేస్తూ, 'సత్యం శివమ్ సుంద రమ్' (God, Truth and Beauty) ఒకటే సుమా అని హెచ్చరిస్తూ, సౌందర్యా రాధనలోనే, సౌందర్యో పాసనలోనే భక్తితత్వం - జీవాత్మ, పరమాత్మ : రాధాకృష్ణులు ; ప్రకృతి పురుషులు - యిమిడి వున్నదని చెబుతూ, భక్తిపథాన భవ బంధాల వొత్తిడి తగ్గించుకోమంటుంది. జయ దేవుని గీత గోవిందమైనా, త్యాగరాజు కీర్తనలైనా, అన్నమయ్య పదకవిత లైనా సౌందర్యాన్ని విరజిమ్మేవే" - అన్నారు దేవదాసు తమ గంభీరో పన్యాసంలో .... 'నిరుడు కురిసిన హిమ సమూహములేవి తల్లీ' (శ్రీ శ్రీ రచన) అంటూ శ్రీనివాసన్ ఎంతో సందర్భోచితంగా, సుశ్రావ్యంగా, ప్రతి గుండెలోనూ శ్రీ శ్రీ వేదన పలికేటట్లు పాడారు. లలిత వందన సమర్పణ చేశారు .... ఇండియన్ ఫిలాసఫీని పాశ్చాత్య ప్రపంచానికి సన్నిహిత పరిచిన వారు రాధాకృష్ణన్. 'గాడ్ ఈజ్ ట్రూత్, గాడ్ బ్యూటీ' (సత్యమే శివమ్ సుందరమ్) అని 1932 లో కొలంబియా రికార్డు యిచ్చిన వారు గాంధీజీ .... 'నేను సైతం - ప్రపంచా గ్నికి - సమిధ నొక్కటి ఆహుతిచ్చాను .... విశ్వవీణకు తంత్రినై మూర్ఛనలు పోతాను' అని అరవై ఏళ్ల క్రితం చెప్పిన శ్రీ శ్రీ, పతితులు భ్రష్టులు, బాధాసర్ప దష్టుల కోసం, మానవ హృదిలో ఆశాదీపంలా వెలిగే 'మరో ప్రపంచం' సృష్టించారు. తెలుగు కవితా లోకాన అది అజరామరం.

—యన్నార్ చందూర్



---

రేపటి చింతలు పెట్టుకోకు. ఎందు కనగా, రేపటి అక్కరలను రేపటి దినమే చూసుకుంటుంది.

మానవుల తప్పులను నీవు మన్నిం తువేని, స్వర్గమున నున్న 'తండ్రి' నీ తప్పులను మన్నించును.

ధనవంతుడు భగవత్ సామ్రాజ్య మున ప్రవేశించుటకంటె, ఒంటెకు సూది రంధ్రమును ప్రవేశించుట తేలిక.

తండ్రీ, వారిని మన్నింపుము. తాము ఏమి చేయుచున్నదీ వారెరుగరు.

నీవు ఇచ్చునపుడు కుడిచేయి చేసిన దానిని ఎడమచేతికి తెలియనీయకు.

మీ ఆత్మలను చంపలేక, శరీరా లను మాత్రమే చంపువారిని చూసి, భయపడకండి. —జీసస్

---

# చిత్రజగతి

### శివపార్వతీ వారి
### 'వామ్ పైర్'
### (Vampire in Venice)

'వామ్‌పైర్' ని తెలుగులో భూత మనిగాని, పిశాచమనిగాని అంటారు. భూతప్రేత పిశాచాలకు సంబంధించిన కథలు అన్ని దేశాలలోను, అన్ని భాషలలోను వున్నాయి. నవరసాలలో భయానక, బీభత్స అద్భుతరసాలకు స్థానం లేకపోలేదు. ఆ రోగ్య వంత మగు ఆలోచనాపద్ధతి గలవారు దెయ్యాల కథలని మెచ్చుకోలేరు. దెయ్యమనగా ఏమిటి? దేవునికి వికృతి. దెయ్యం పట్టింది, గాలి సోకింది - అనేవి వింటూంటాం. అలాగే, 'శని' విరగడైంది, అనేది. ఇలాటివన్నీ రక్తంలో జీర్ణించుకు పోయిన, ప్రాకృతిక ప్రాచీన భయాలు .... వెన్నీస్ నగరంలోని తమ పురాతన భవనంలో నివశిస్తున్న 'హెతిటి' కి, రెండువందల సంవత్స రాలక్రితం, తమ రాజవంశానికి చెందిన 'లెటిజియా' ని 'నస్ఫెరుస్టు' అనే భూతం మునిపళ్లతో కొరికి పొట్టనెట్టుకుందనీ, మూలగదిలో వున్న శవపేటికలో 'లెటిజియా' మృత దేహంతో బాటు ఆ భూతం బందీయై వున్నదనీ గట్టినమ్మకం. భూత ప్రేతాల గురించి పరిశోధన చేసిన 'కాటలొనా' ని పిలిపిస్తుంది. ఇనపరేకులతో గట్టిగా తాపడం చేసిన ఆ పేటిక చూసిన మీదట 'దానిని ఎందుకు కదపటం? అంటాడతను. హెతిటి, ఆమె ప్రియుడు బర్నాబొ 'ఎంతకాలమని వోపిక పట్టడం - ఆ దెయ్యాన్ని ఇంట్లో నుంచి వదిలించుకోవాలి' - అంటారు. మనుషుల్ని లిపించి, పెట్టెబద్దలు కొట్టగా వికృతాకారంలో జీర్ణించివున్న స్త్రీ శవం కనిపిస్తుంది. అంతవరకు బాగానేవుంది. కాని, ఇన్నాళ్లు గాలిలా పెట్టెలోవున్న 'నస్ఫెరుస్టు', బయటికి పారిపోయి మనిషవుతాడు. అతనికి వెయ్యి సంవత్సరాలకి గాని మరణం లేదట. అతనికి ఒక 'వర్జిన్' (కన్య) కావాలి; ఆ వర్జిన్ ఎవరంటే 'హెతిటి' చెల్లెలు మేరియా. ఆ మేరియా బట్టలు వొలిచి, రెండు చేతులు పట్టుకు, ఎత్తుకుపోవడంతో చిత్రం ముగుస్తుంది. దర్శకుడుఅగస్టొ కామినిటో (Augusto Caminito) ఫొటొగ్రఫీతో మెప్పించి, సన్నివేశాలతో హడల గొడతాడు.... పి ఆర్ ఒ: టి యమ్ రామన్.

సీరియల్

# మధు స్వప్న శాఖ

## పూజిత

గడిచిన కథ : శ్రీనివాసరావు ఏకైక పుత్రిక లావణ్య, పెళ్లి పీటలమీద కూచుని, అగ్నిహోత్రానికి జడుసుకు, మతిభ్రమణకు లోనవుతుంది .... సూర్యారావు, ప్రమీలల ముగ్గురు ఆడ పిల్లలలో పెద్దమ్మాయి విశాల సివిల్ ఇంజనీరు కోర్సు పూర్తిచేసింది.... ఇక చదవండి.

"మమ్మీ !" .... వెనక్కు తిరిగి చూచి అయిష్టంగా ముఖం పెట్టి "విమ్మీ .... ఇలారా" అంది.

తల్లి దగ్గరగా వచ్చి నిలుచుంది విమల.

"నీకెన్నిసార్లు చెప్పాను - ఇలాంటి పిచ్చి పిచ్చి వేషాలతో కాలేజికి వెళ్ళొద్దని ?"

"వూ(మమ్మీ...." అంటూగారాలు పోయింది విమల. ఒకరి డ్రస్సులు ఒకరు చూసుకు తృప్తిపడ్డారు విమల శర్మిల.

ఈ పిల్లలిద్దరిని అతిగారాబంతో పాడు చేస్తున్నాడీయన. విశాల ఎంత అణకువగా వున్నప్పటికి, ఆమెను నిందిస్తున్నాడు. ఆరోజుల్లో స్టెప్‌మదర్స్ ఇలా ప్రవర్తించేవాళ్ళు ; ఇప్పుడు స్టెప్‌ఫాదర్స్ వెనకటి స్టెప్‌మదర్స్ లేనా ? .... ఫోన్ రింగయింది.

"హలో మమ్మీ .... నేను విశాలను, సారీ, మమ్మీ, మీరు గుడికి వెళ్లారు. ఇంట్లో ఎవరు నిద్రలేవలేదు. అందుకే పనమ్మాయి దగ్గర చెప్పి వచ్చేశాను."

"అంత తొందర ఏమొచ్చింది ? నేనొచ్చేంత వరకు వుండకూడదూ ?" కరకుగా అడిగింది ప్రమీల.

"సారీ, మమ్మీ .... పేపరు చూశాను .... నాకు ఏమితోచలేదు?"

"ఏమైంది పేపర్లో ?"

"చందన వాళ్ళన్నయ్య లండన్ నుండి బయలుదేరిన ప్లేన్‌లో ఉన్నాడు - అది క్రాష్ అయింది. చందనను చూడనిదే మనసు నిలువలేదు."

"అలాగా పాపం"

"అతను ఆ ఫ్లయిట్ మిస్‌చేసినట్లు, అదృష్టం బావుండి ఆ ఫ్లయిట్‌లో అతను లేడు. లండన్ ఫోన్‌చేసిన మీదట తెలిసింది."

"రాజేశ్వరాంటీకి ధైర్యంగా వుండమని చెప్పు - నేను కొద్ది సేపట్లో వస్తాను."

"ఒ.కె. మమ్మీ" అని ఫోన్ పెట్టేసింది విశాల.

### 5

స్కూటరు మీదనుండి నెమ్మదిగా దిగింది శర్మిల.

"లోపలకు నడవగలవా? నేను హెల్ప్‌చేయనా -" ఆమె చేతిని పట్టుకుంటూ అడిగాడు శేషాద్రి.

"అమ్మబాబోయ్ .... వద్దు .... నిన్ను మా మమ్మీ చూసిందంటే నీ కాళ్ళు విరిక్కొట్టి, .... కట్టుకట్టి పంపిస్తుంది. నీవు వెళ్ళు, నేనే నెమ్మదిగా వెళ్తాను."

శేషాద్రి స్కూటర్ స్టార్ట్ చేసుకుని ఆమె అరచేతిని, మెల్లగా తన చేత్తో నొక్కి, ముద్దుపెట్టుకుని వెళ్ళిపోయాడు. అతను వెళ్ళినంత దూరం చూస్తూ నిలుచుని .... తరువాత గేటు తెరచుకుని, మెల్లగా కుంటుకుంటూ వచ్చి బజర్ నొక్కింది.

చందన వాళ్ళింటికి వెళ్లాలని తయారవుతున్న ప్రమీల, ....'ఇప్పుడు ఎవరు వచ్చారా?' అనుకుంటూవచ్చి, తలుపు తెరిచింది. ఎదురుగా శమ్మి కాలు కట్టుతో, గోడకు ఆసరాగా చేతినాన్చి నిలుచుని వుంది.

"ఏమయింది, శమ్మి?" - కంగారుగా అడిగింది ప్రమీల. శమ్మి అసలు విషయం చెప్పకుండా, చిన్న అబద్ధం చెప్పింది. బోయ్ ఫ్రెండ్‌తో స్కూటరు మీద వెళుతూ, పడిన విషయం చెపితే తల్లికి కోపం వస్తుందని, క్రికెట్ ఆడుతూ పడ్డానని చెప్పింది.

చేయి పట్టి నడిపిస్తూ తీసికెళ్ళి, బెడ్‌రూమ్‌లో కూర్చోపెట్టి, "నీకెన్ని సార్లు చెప్పాను క్రికెట్ ఆడొద్దని?" - అని గదమాయించింది.

"సారీ, మమ్మీ."

"వూఁ.... చేసిన తప్పుకు సార్ చెపితే సరిపోతుందా?"

"అయితే నన్నిప్పుడేమి చేయమంటావ్?"

"చేయవద్దన్న పనిచేసి, దెబ్బలు తగిలించుకుని, ఇప్పుడు నన్నేమి చేయమంటావ్ అని ఎదురు ప్రశ్న....అసలు నీకు కొంచెం కూడా భయంలేదు. తల్లి మాటంటే లక్ష్యంలేదు. ఇంకెప్పుడు ఇలా ఒళ్ళు తెలియకుండా ఆడకు."

"ఒకె మమ్మీ.... కొంచెం కాఫీ ఇస్తావా, మమ్మీ."

ప్రమీల వెళ్ళి కాఫీ కలిపి తెచ్చిచ్చింది.

కాఫీ తాగి, "మా మమ్మీ మంచిది - ఇక ఆడనులే."

## 6

నిశ్శబ్దంగా వుండే ఆ ఇంట్లో గ్రాండ్ మదర్ శాంతమ్మగారి కంఠం కంచులా మ్రోగుతుంది. "నేనప్పుడే చెప్పానే తల్లీ, పిల్లాడ్ని అంతదూరం పంపొద్దని! విన్నారు కాదు నా మాట. పిల్లలు మన కళ్ళ ముందు వుంటే, ఈ అగచాట్లు వుండునా? ఏమిటో అందరూ ఫారన్, ఫారన్ అని.... ఎగబడతారు. మన ఇండియాలో లేనిదే ముందట అక్కడ? నాగార్జునా, ఏమయ్యావురా నా బంగారు తండ్రీ ...."

ఆ ధోరణి వినలేక పోయింది చందన.

"మనిషి చంద్రమండలంలోకి వెళ్ళి వస్తున్న రోజులివి.... మీ రోజులు మరచి, సైలెంట్‌గా వుండు, గ్రాండ్‌మా! మనిషి పుట్టేది నాలుగు

మెతుకులు తిని చచ్చేదానికి కాదు. ప్రగతి సాధించాలి, పేరు ప్రతిష్ఠలు సాధించాలి."

"ఏమిటే పిచ్చుకా.... నీకేం తెలుసే లోకం ?"

"చందూ, నీవూరుకోమ్మా ! పెద్దావిడ ఇలా జరిగిందనే వేదనలో ఏదో అంటే, దానికెందుకీ చంద్రమండలం ....ఉపన్యాసాలు." - మందలింపుగా అంది రాజేశ్వరి.

"ఫోను మోగింది పక్కనేవున్న రాజేశ్వరి అందుకుంది.

"రాజశేఖరంగారు వున్నారా ?"

"లేరండీ, ఆయన బొంబే వెళ్ళారు."

"ఎప్పుడొస్తారు ?"

"బహుశా సాయింకాలానికి వచ్చేయవచ్చు."

"నేను ఆయన చిన్ననాటి స్నేహితుడ్ని. నా పేరు శివసుందరం వచ్చాక చెప్పండి నేను ఫోను చేసినట్లు" అని ఫోను పెట్టేశాడాయన.

"అన్నయ్య ఈ రోజు వచ్చేది ఎవరికి తెలియదు. అలా తెలిసిగాని వుంటే, ఈ పాటికి, ఇంటినిండా జనంతో...." విశాలతో చందన అంటూండగా మళ్లీ ఫోను.

"హలో" - అంది చందన.

"నేను ప్రమీలను మాట్లాడుతున్నాను. శమ్మికి క్రికెట్ ఆడుతుంటే కాలికి దెబ్బ తగిలింది. అందువలన వెంటనే రాలేకపోయాను. విశాల అక్కడే వుందా ?"

"ఆ, వుంది, ఫోనివ్వనా ?"

"వద్దులే - నేనే వస్తానుగా"

"సరే, ఆంటీ"

ట్రింగ్ ట్రింగ్ - దగ్గరే వున్న విశాల రిసీవ్ చేసుకుంది.

# సినిమా పేరు ?

నీ వుంటే వేరే కనులెందుకూ
నీ కంటే వేరే బ్రతుకెందుకూ

రచన : నారాయణరెడ్డి ; పాడినవారు : యస్పి బాలసుబ్రహ్మణ్యం

ఆ పాట ఏ చిత్రంలోనిది ? సరిగా చెప్పగలిగిన మొదటి యిరువురికీ పదేసి రూపాయలు బహుమతి. ఎక్కువ మంది చెప్పగలిగినప్పుడు, చీట్లువేసి, మొదటి యిరువురికే బహుమతి ఇవ్వడం జరుగుతుంది.

మీ జవాబు కార్డుమీదనే వ్రాయండి : చివరి తేదీ ; 15-8-1990



JAGATI, 2, Kutchery Road, PB 2922. Mylapore, Madras-600 004.

"యస్, హలో ఎవరిదా గోల్డెన్ యివాస్.... ?" అవతల వ్యక్తి అడిగాడు.

విశాల ముఖం ఎర్రబడింది.

"మిస్టర్, వాట్ ఆర్ యూ టాకింగ్." 'ఎవరో గడుగ్గాయి' అంది విశాల.

చందన ఫోనందుకుని, 'హలో' అంది.

"హాయ్.... చందూ."

"అన్నయ్యా నీవా."

"ఎక్కడ నుంచి.... ?"

"లండన్ నుంచి"

"హమ్మయ్య మమ్మీ, గ్రాండ్‌మా విశాల అంతాఇక్కడే వున్నారు."

"విశాల ఎవరు....?"

"నా ఫ్రండ్ .... ?"

"మొదట ఫోన్ రిసీవ్ చేసుకున్న ఆ గోల్డెన్ వాయిసేనా.... ?"

"వూఁ"

రాజేశ్వరి, శాంతమ్మ మాట్లాడారు.

"కారులో ఏరోడ్రోమ్‌కు తీసుకొస్తున్న ఫ్రండ్‌కి సడన్‌గా పెయిన్ వచ్చిందట. వెనక్కు వెళ్ళి అతన్ని ఆస్పత్రిలో అడ్మిట్ చేశాక, అది హార్ట్ ఎటాక్ కాదనీ యాసిడిటీకి సంబంధించినదనీ తెలిసిందట. ఏమయితేనేం అకస్మాత్తుగా వచ్చిన ఆ పెయిన్ బ్రదర్‌కు ప్రాణదానం చేసింది" అంది చందన

అందరి మనసులు ప్రశాంతం అయ్యాయి. ఏడుకొండల స్వామి ముడుపు గుర్తొచ్చి పూజగదిలో కెళ్ళింది శాంతమ్మ.

టోస్టు కాఫీ తెచ్చింది.... లోపల్నుంచి రాజేశ్వరి ; పొద్దుటి నుంచీ ఎవరూ ఏమీ తినలేదు.

కాఫీలయాక కారు తాళాలు తీసుకొని "మమ్మీ నేను విశాలను వాళ్ళ ఇంటివద్ద డ్రాప్‌చేసి, శమ్మిని కూడ చూసి వస్తాను" అని చెప్పింది చందన.

"వెళ్ళొస్తాను," అంటూ రాజేశ్వరీ, శాంతమ్మ వద్దకూడా సెలవు తీసుకుంది విశాల.

"రేపు నీవుకూడ ఏయిర్‌పోర్ట్‌కి రావాలి" - అంది చందన.

"నేనెందుకట ?"

"ఆ గోల్డెన్ వాయిసేది అని అన్నయ్య అడిగితే నేనేం చెప్పేది ?" విశాల తనలో తను నవ్వుకుంది.

## 7

స్పృహలేకుండా పడివున్నలావణ్య. మంచం దగరే కూర్చుని చూస్తూన్నాడు శ్రీనివాసరావు. లావణ్య లేస్తూనే, ఏమి చెబుతుందా అనే ధ్యాస, ఆయనకి ఆకలి దప్పులను మరిపించింది.

మగపెళ్ళి వారు వెళ్లిపోయారు ; పీటలమీద పెళ్లి ఆగి పోయింది. అంతా తలకిందులవటం కాస్తంత అవమానంగా వున్నప్పటికీ, అంతకంటె ముఖ్యం లావణ్య కోలుకోవటమూ ఆమె ఆరోగ్యమూను ! డాక్టరు వచ్చి లావణ్యను చూశాడు.

"డోంట్ వరీ, మిష్టర్ శ్రీనివాసరావ్.... సడన్‌గా ఆమెకు ఏదో షాక్ తగిలింది. స్పృహ వస్తూనే, నార్మల్

అవుతుంది. ఇంజక్షన్ ఇచ్చాను - అమెనెవరూ డిస్టర్బ్ చేయొద్దు; బాగా నిద్ర పోనీయండి. తనుగా తను లేచి నపుడు, పరిస్థితి ఎలావుందో గమనించి, వెంటనే నాకు ఫోన్ చేయండి" అని చెప్పి వెళ్ళిపోయాడు డాక్టరు.

ఆ రాత్రి పదకొండు గంటల ప్రాంతంలో కొద్దిగా కళ్ళు తెరిచింది లావణ్య.

కొద్దిగా తెరచిన కళ్ళను అటు, ఇటు కదిలించి, మళ్లీ వెంటనే - మూసుకుంది. పెళ్ళికని వచ్చిన మాధవరావు దంపతులు, శ్రీనివాస రావుకీ సాయంగా అక్కడే వుండి పోయారు.

8

ప్లేన్ దిగాడు నాగార్జున.

చేయెత్తి వూపింది చందన.

కస్టమ్స్ దాటుకు బయటకి వచ్చాడు.

"అన్నయ్యా, నీ మాట ప్రకారమే ఏర్ పోర్టుకి ఎవ్వరినీ పిలవలేదు - ఇదిగో నా ఫ్రెండ్‌ని ఒక్కతె తప్ప" అంది.

చిరునవ్వుతో ఆ ఫ్రెండ్‌ని పలకరించాడు నాగార్జున.







లేత నీలిరంగుమీద ముదురు నీలి రంగు లతలున్న చీర, అదే రంగు జాకెట్, ముత్యాలదండ ధరించి, నీలాకాశంలోని నెలవంకలా ఉంది విశాల.

రవివర్మ చిత్రంలా ఉంది నాగార్జున కళ్ళకు ఆమె.

ముగ్గురూ కారులో కూర్చున్నారు. వెనుక సీట్లో చందన, విశాల; ముందు డ్రైవరు పక్కన నాగార్జున.

"మా అన్నయ్య బావున్నాడు కదూ?" విశాల చెవిలో గుస గుస లాడింది చందన.

"ఛ.... నాకేమి తెలుసు.... ఆ ప్రశ్న అడగడానికా నన్ను తీసు కొచ్చింది?"

"కాదులేమ్మా, మా ట వ ర స కి అడిగాను"

ముగ్గురూ ఇంట్లోకొచ్చారు.

"నాగార్జునా, నీవు క్షేమంగా ఇల్లు చేరితే ఏడుకొండల స్వామికి కళ్యాణం చేయిస్తానని మ్రొక్కుకున్నాను"

"బ్రతికించావు గ్రాండ్‌మా.... నాకు గుండుచేయిస్తానని మొక్కుకోలేదు.... దేవుడుకి పెళ్లి కదా - నిక్షేపంగా చేయిద్దాం," అన్నాడు నాగార్జున.

అందరూ గల గలా నవ్వేశారు. ఫలహారాలయాక, "ఇక నేను వెళ్లి వస్తాను" అంటూ లేచింది విశాల.

"వుండమ్మా.... భోజనం చేసి పోదువుగాని" అంది రాజేశ్వరి.







విశాలలోని ప్రతి కదిలికను గమనిస్తున్నాడు నాగార్జున. చందన చెప్పినట్లు - ఆమె నాటీ కాదు, హాటి కాదు - స్వీటీయే! భోజనాలు ముగించారు.

"చందూ, నీవేమో జానెడు జుట్టులో ఫారినమ్మాయిలా వున్నావు. నీ ఫ్రెండేమో స్వచ్ఛమైన భారతనారిలా వుంది," అన్నాడు నాగార్జున.

"తెలుగు సినిమాలోని హీరోయిన్ నా లాగానే.... వుంటుందిలే, అన్నయ్యా" - రఫీమని జవాబు చెప్పింది చందన.

విశాల కూడా నవ్వేసింది.

రేపు మనింట్లో పార్టి యిస్తున్నాం, నాకు హెల్ప్‌గా రావాలి విశాలా," అంది చందన.

"వుహు, రాను"

"ఏం ?"

"కాలేజి వుంది"

"నాకు లేదేమిటి ?"

"నీకు ఎగనామాలు అలవాటేగా ?"

"రేపొక్కరోజు నీవూ ఆ పని చేయ కూడదూ ?"

"నీ జాబితాలో కలసి పొమ్మంటావ్..."

"ప్లీజ్, రేపొక్కరోజే.... నాకోసం స్వీటీ"







"అదిగో, అలా స్వీటీ గీటీ అన్నావా నేనూరుకోను....,"

"పోనీ చల్లని మాతల్లీ కరుణించవే అంటాను."

విశాల నవ్వేసింది.

"ఎలా వెళతారు ?" అని అడిగాడు నాగార్జున.

"ఆటోలో" అంది విశాల.

"అయ్యో నాకాలు బెణికింది.... నడవలేను.... ఎలా.... ఇప్పుడు పర్వాలేదు కారులో కదా ! వెళ్ళు చందూ !"

"డ్రైవరులేడు నీవు వెళ్ళి దింప రాకూడదూ," అన్నాడు నాగార్జున, చందనతో.

"నీవెళ్ళిరా...." కారు తాళం అందించింది.

"నీవుకూడా రా...." అన్నాడు చందనతో.

ఇల్లు చేరాక, "లోపలకు రండి," అని ఆహ్వానించింది విశాల.

"వద్దు - ఇంకొకసారి వస్తాం" అన్నాడు నాగార్జున దారికిరు వైపులా గుండెమల్లెపొదలు....

సిగరెట్ పొగను రింగు, రింగులుగా వదులుతూన్న వ్యక్తి "హలో, విశాలా .... డ్రీమ్‌లోనుంచి నడచి వస్తున్నట్లు న్నావ్ ? ఎక్కడి కెళ్ళాలేమిటి ?" అన్నాడు.

"నేనెక్కడి కెళ్ళింది నీకెందుకు ?"

'ఈ శనీశ్వరుడు.... ఎందుకొచ్చా డిపుడు ?' - అనుకుంటూ, తనరూమ్ లోకి వెళ్ళి.

(ఇంకా వుంది

